


ఆలీ బాబా

అను




# అదృష్టవిజయము

సోమరాజు రామానుజరావుచే

రచింపఁబడినది.



పబ్లిషరు:

కురుకూరి సుబ్బారావు,

బుక్ సెల్లర్ అండ్ పబ్లిషర్,

భీమడోలు, (పశ్చిమగోదావరిజిల్లా.)



మొదటికూర్పు 1000 ప్రతులు.



కాకినాడ:

కోటమర్తి చినరఘుపతిరావు గారిచే

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1926

(కాపీరైటు) (వెల రు 1-0-0)







# ఆంధ్రనాటకములు

| | రు. | అ. |
|---|---|---|
| కనకతారానాటకము చం॥ కే॥ | 1 | 4 |
| కృష్ణలీల బళ్ళారి పం॥సు॥ | 1 | 8 |
| లవకుశ బళ్ళారిది డిట్టో | 1 | 8 |
| కన్యాశుల్కము గు॥అ॥ | 1 | 0 |
| రోషనారా కొ॥సు॥ | 1 | 4 |
| తులసీదేవి ము॥చె॥ | 1 | 0 |
| బొబ్బిలియుద్ధము శ్రీ॥ కృ॥ | 1 | 0 |
| రసపుత్రవిజయము ఇ॥ య॥ | 1 | 0 |
| రాణాప్రతాప్ సింగ్ డిట్టో | 1 | 0 |
| భక్తరామదాసు కే॥ క॥ | 1 | 0 |
| రామదాసు బళ్ళారి డి॥ గో॥ | 1 | 0 |
| రామదాసు రా॥ నా॥ | 1 | 0 |
| చింతామణి కా॥ నా॥ | 1 | 2 |
| చింతామణి ద॥ మా | 1 | 0 |
| చింతామణి రా॥ నా॥ | 1 | 0 |
| వైరాగ్యచింతామణి బ॥ కో॥ | 1 | 0 |
| కంఠాభరణము పా॥ ల॥ | 1 | 0 |
| రాధాకృష్ణ డిట్టో | 0 | 10 |
| సావిత్రి శైలవరంవారు ప్రదర్శించేది శ్రీ॥ వ॥ | 1 | 2 |
| సత్యహరిశ్చంద్రీయము బ॥ ల॥ | 1 | 2 |
| రుక్మిణీవిలాసము డిట్టో | 1 | 0 |
| ఉత్తరరాఘవము డిట్టో | 1 | 4 |
| సాత్రాజితీయము | 0 | 14 |
| మహానంద బ॥ కో॥ | 1 | 0 |
| జయంత జయపాలము | 0 | 12 |
| వేణీసంహారము క॥ సు॥ | 1 | 0 |
| శకుంతల కం॥ వీ॥ | 1 | -0 |
| శకుంతల వ॥ సు॥ | 1 | 0 |
| అలీబాబా క్రొత్తనాటకం సో॥ రా॥ | 0 | 12 |
| శ్రీరామ పట్టాభిషేకము జ॥ ల॥ | 1 | 0 |

| | రు. | అ. |
|---|---|---|
| గయోపాఖ్యానము చి॥ ల॥ | 0 | 8 |
| ప్రసన్నయాదవము డిట్టో | 0 | 8 |
| పారిజాతాపహరణము | 0 | 8 |
| చతురచంద్రహాస డిట్టో | 0 | 8 |
| పార్వతీపరిణయము డిట్టో | 0 | 6 |
| స్వప్నవాసవదత్త డిట్టో | 0 | 6 |
| పాండవ జననము రా॥ నా॥ | 0 | 1 |
| పాండవ ప్రవాసము డిట్టో | 0 | 12 |
| పాండవోద్యోగము డిట్టో | 0 | 1 |
| పాండవవిజయము డిట్టో | 0 | 1 |
| పాండవాశ్వమేధము డిట్టో | 0 | 1 |
| అహల్యా శాపవిమోచనము | 0 | 1 |
| ద్రౌపది వస్త్రాపహరణము | 1 | |
| సంపూర్ణ రామాయణము గా॥ కో॥ | 1 | |
| సంపూర్ణ రామాయణము కో॥ సు॥ | 1 | |
| సంపూర్ణ భారతము పి॥ వ॥ | 1 | |
| మహాభారతము సం॥ శి॥ | 1 | |
| సంగీత కృష్ణలీల డిట్టో | 1 | |
| అర్జున ప్రతిజ్ఞ వ॥ వెం॥ | 0 | [illegible] |
| భీమప్రతిజ్ఞ క॥ కో॥ | 0 | 12 |
| భీష్మప్రతిజ్ఞ అ॥ శే॥ | 0 | 1 |
| మోహినీ రుక్మాంగద డిట్టో | 0 | 12 |
| రాణీసంయుక్త డిట్టో | 8 | [illegible] |
| భక్తకబీర్ కో॥ సు॥ | 1 | [illegible] |
| పాదుకాపట్టాభిషేకము దో॥ సీ॥ | 0 | 12 |
| లంకాదహనము | 0 | 10 |
| వేశ్యాహితబోధిని డిట్టో | 1 | 0 |
| వేశ్యామధురం పా I | 1 | 0 |
| డిట్టో పా II | 0 | 12 |
| డిట్టో పా III | 0 | 8 |
| సురాజుద్దౌలా జ॥ ల॥ | 0 | 8 |

వలయువారు: — తుమ్మలూరి సుబ్బారావు,

బుక్ సెల్లరు అండ్ పబ్లిషర్, భీమడోలు, పశ్చిమ గోదావరి జిల్లా.

ఆలీబాబా

అను

# అదృష్టవిజయము

ఇది

స్వరాజ్యరథాది బహుగ్రంథకర్తయు భద్రాపలపురవాసియునగు

సోమరాజు రామానుజరావుచే

రచింపబడినది.



ప్రకాశకుడు:

కురుకూరి సుబ్బారావు,

బుక్‌సెల్లర్ అండ్ పబ్లిషర్,

భీమడోలు. (పశ్చిమగోదావరిజిల్లా)



మొదటికూర్పు 1000 ప్రతులు.



కాకినాడ:

కొటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

1926

All Rights Reserved] [వెల రు 1-0-0.

# విజ్ఞాపన.

ఇది "అరేబియన్ నైట్సు" కథలలోని "ఆలీబాబా నలుబది దొంగలు" అను పేరుగల కథ. దీని నాంధ్రదేశమునకు ప్రస్తుత దేశ కాల పాత్రములకుఁ దగినవిధంబున భద్రాచలపురవాసియు స్వరాజ్య రథాదిబహుగ్రంథకర్తయు నగు శ్రీయుత సోమరాజు రామానుజరావు గారిచే—వారు రంగూనుపురమున శ్రీయాంధ్రజాతీయ నాటకసభయం దున్నపుడు తత్సభాధికారులగు శ్రీ వెలగల వేంకటరెడ్డిగారి యాజ్ఞాప్రకారము రచింపఁబడి యనేకసారులు ప్రదర్శింపఁబడి పేరుగాంచినది. ఇందలి కథాసంవిధానము పాత్రపోషణము యథోచితముగ నున్నదనియే మా నమ్మకము. నెరసు లున్నచో సంక్షితులు మా కెఱింగించి నట్లయిన గ్రంథకర్తగారి యనుమతిపై పునర్ముద్రణమున సవరించు కొందుము.

ఇట్లు,

ప్రకాశకులు.

ప్రథమమున దీనిం బ్రదర్శించువారికి రజతపాత్ర
బహుమానము

# ఇందలి పాత్రలు

## పురుషులు.

1. అదృష్టగుప్తుడు
2. లోభగుప్తుడు
3. మైరావణుడు
4. జంబూకుడు
5. మారీచుడు
6. కరటకుడు.
7. దమనకుడు
8. రేచుక్క
9. పగటిచుక్క
10. పోలీసుకర్మచారి
11. ఇద్దఱు భటులు
12. మైరావణుని పరివారము 40 దొంగలు
13. అదృష్టగుప్తుని బంధువులు
14. రామలాలు

## స్త్రీలు.

15. చతుర
16. ప్రమద



# అలీబాబా

అను

# అదృష్టవిజయము.



## ప్రథమాంకము.

[రాట్నము త్రిప్పుచు చతుర ప్రవేశించును.]

చతు—(పాట) మోహన—రూపకం.

జయ జయ రాట్నపుమాతా। జయ జయ సుగుణోపేతా
జయ జయ సఫలప్రదాత। జయ సుజాతా॥ జ॥
నీమహిమంబున హైందవ। నిఖిలావనిజులు నాగరికులై
ప్రాకటులై। విఖ్యాతిని మెఱసిరిగదమ్మా॥ జ॥
మాంఛెష్టరు మిల్లులెల్ల। మాతరో నీశక్తిచేత।
సంఛేదిత కుక్ష్యభాగ। జాలములై నశియుంచును॥ జ॥
తల్లీ। హైందవుల కల్పవల్లీ। సుగుణామతల్లీ।
వెల్లుగ నిను వాశించిన। బీదల మము బాలింపుము॥ జ॥

ఆహాహా! రాట్నపుదివ్యమహాత్మ్యము నెంతతలంచినను దనివితీఱదు గదా!

శా. రాట్నంబే సకలార్థసాధక మగుఁ రాట్నంబె సంపూజ్యమౌ
రాట్నంబే భరతస్వారాజ్యసౌధప్రారంభ సోపానం బగుఁ

అదృష్టవిజయము.

రాట్నంబె పరదేశవస్త్రహరణబ్రహ్మాస్త్ర సాదృశ్య మౌ
రాట్నం బీశ్వరచక్రసన్నిభము స్వారాజ్యప్రభాదీప్త మా
సీ పిడికెడన్నము లేని బీదసాధులకెల్ల
నిర్మలచింతామణీ సమంబు
బహువిదేశోన్ముఖ భారతీయధనస్ర
వంతీసితాంతనివారణంబు
పరదేశధనదాహబ్రహ్మరక్షస్సమూ
హముల పాలి సుదర్శనాయుధంబు
చిరకాలమునుండి భరతవర్షమునకు
గురుతరాయుశ్శ్రీలఁ గూర్చు తల్లి
మఱువక భజించువారల మనుచుతల్లి
విస్మరించిన నణచు వివేకవల్లి
ఘనతరైశ్వర్యములఁ గూర్చు కల్పవల్లి
కామితము లిచ్చు చరకేందిరామతల్లి.

[అదృష్టగుప్తుఁడు ప్రవేశించును.]

అదృ—చతురా! అతిపవిత్రమైన నీచరకాగానము నా శ్రవణంబులకు బ్రహ్మానందముం గూర్చి నన్నిందు లాగుకొనివచ్చినది. శ్రీకృష్ణ మురళీనాదము బృందావనమునందలి గోగోపికానికరంబు నాకర్షించినటు లీచరకానినాదము భారతీయుల నిట్టె సమాకర్షించును గదా!

చతు—అటులే సమాకర్షించినచో మనదేశ మిట్లు దరిద్రదేవతకు నిలయమై యుండనేల? ఇన్నిదినములనుండియు ఖద్దరువస్త్రము నే కట్టుఁడని మీరుచేయు ప్రచారములందలి బోధలను విని యెందఱు ఖద్దరును దాల్చినారు? ఎందఱు చరకా చేఁబట్టినారు?

అదృ—విదేశవస్త్రవ్యామోహమునఁ బడిన మన హిందువుల దుస్థితిం దలంచుకొనిన మిగుల సంతాపమగుచున్నది.

సీ. కడు దట్టమైన యీ ఖద్దరుగుడ్డ ధ
రింపలే మను నాగరికుఁ డొకండు
సన్నని గ్లాసుగో సవరించి మడచియుచు
విడువఁగలేని వివేకి యొకఁడు
ఆతప వేళలఁ దతిను స్నహంబు లీ
మురికగుడ్డల నెడుమూర్ఖుఁ డొకఁడు
మందంపు గుడ్డచే నందంబు చెడునని
మదినెంచు నతిసుకుమారి యొకఁడు
ఆ. వె. మనను రాట్టమూన మర్యాదకే భంగ
మనుచు దలచు దుష్టజనుఁ డొకండు
ఖద్దరనిన నెఱుఁగఁగాలేక వ్యామోహ
వార్ధి మునిఁగె భరతవర్ష మిపుడు.

[లోభగుప్తుఁడు ప్రవేశించును.]

లోభ—అదృష్టగుప్తా! నీవు సుఖముగ నిచ్చటనే పొద్దులు పుచ్చుచుంటివా? చతురా! నీవింక నా పాడు రాట్టమును విడువ లేదా?

అదృ—హరిహరి! సోదరా! పరమపవిత్రమై భరత రాజ్యాభ్యుదయ హేతువైన రాట్టమును దూషించుచున్నా రేమి?

లోభ—నీకంటికి పరమపవిత్రమైనది నాకంటికి నేడు పరమవిద్రోహ కారణమై తోఁచుచున్నది. నేఁటి మనయధికారుల యుద్దేశము నెఱుంగవా!

గీ. తివిరి రాట్టఁబునను నూలు దీయువారు
గట్టిఖద్దరువస్త్రము లట్టువారు

పూని సర్కారునౌఖరీ ల్యామువారు
నేఁడు రాజవిద్రోహులై నెగడువారు.

రావుబహద్దురుబిరుదు వహించి సర్కారువారి ప్రాపకముఁ గల్గియున్న
నాయింటనే పుట్టి రాజద్రోహమున కెటమిచ్చెదవా?

అదృ—సోదరా! ఇంత యన్యాయముంకువా?

సీ. మన పాలకుల నవమానింపఁగా నేఁడు
రాట్టంబు క్రొత్తగాఁ బుట్టినదియె?
ఖద్దరువస్త్రము ల్గట్టిన మన పూర్వు
లందఱు విద్రోహు లైనవారె?
నౌఖరీల్సేయక నాగలి చేఁబూను
వారెల్ల ద్రోహులౌవా రగుదురె?
అదిగాక నసహావాదార్భాట మొనరించు
నెల్ల రుద్యమతత్వ మెఱుఁగువారె?
ప్రభులయిన యట్టి సర్కారు వారికన్న,
నెక్కుడుగ మన మేద్రోహ మెఱుఁగనట్టి
వారి విద్రోహులంచును బలుకఁదగునె?
వారొసంగిన బిరుదుల కారణమున.

లోభ—చీ! నీ దుర్వాదమును మానకున్నావు! సర్కారువారి ప్రాపక
మున్నచో మన కనేకలాభములు గలవు!—కంట్రోలు బియ్య
ము సందర్భముననుఁ, కిరసనాయి లస్మకముసంమును నాకు
రావుబహద్దురుబిరుదు వచ్చినది వారి యనుగ్రహమున నేకదా!

అదృ—సోదరా! కోపగింపకుఁడు; ఆ బిరుదులవలన మీ స్వాతంత్రి
శక్తి చచ్చి—కేవలము మీరు బానిసలైతిరి గాని యంతకన్న
నధిక మేమైనఁ గల్గినదా? ఇట్టి యస్వాతంత్రిపుబిరుదులవలన
నేమిలాభము.

లోభ — అదృష్టగుప్తా! నీవింత యవివేకి వగుదువని నే నెన్నఁడు నెఱుఁగ
నైతిని. నీవు చదివినచదువంతయు నేల, తగులఁబెట్టవా ?
ఉద్యోగముచేసి ధనము గణింపని హూణవిద్యావివేక మేల ?
బిరుదులవలన లాభము లేదంటివి ఇటు వినుము.

సీ. పలువురిలో రావుబహదూరుగా రన్న
మొన లేనికీర్తి గణింపవచ్చు
ముఖమోటమున వోట్లను గణించి, కౌన్సిలు
నందు మెంబరుపద మందవచ్చు
సర్కారువారితో సమముగా నున్నత
స్థితి నాసనము లధిష్ఠింపవచ్చు
ప్రాపకంబునఁ జేసి ప్రతివాదిపై సుల
భంబుగా డిక్రీలు బడయవచ్చు
ఇతనితో విరోధ మేహానిఁ గూర్చునో
యనుచు సాటివార లదరుచుండ
నొక్క బిరుదుగల్గి యున్నమాత్రంబున
నమితమైనలాభ మందవచ్చు.

అదృ — సోదరా! పాపము శమించునుగాక! — నీవ్యామోహదశకుఁ
బరిణామకాలము వచ్చినప్పుడే నీ విందలిఫలితంబు నెఱుం
గుదువు గాక ! —

లోభ — నీమొండివాదముం గట్టిపెట్టుము. నీకొఱకై యుద్యోగము
నొకటి విచారించితిని. శ్రేయస్కాముఁడ వైతివేని, నామాట
విని, సర్కా రుద్యోగము గావించి సత్కీర్తినందుము.

అదృ — అన్నా! నన్ను నీ వేమన్నను సరియే; కాని నే నుద్యోగము
మాత్ర మొనరింపను.

గీ. రత్నగర్భ దరిద్రవారాసి మునుఁగ
పరులపాదంబులను గొల్చి బానిసలయి
భారతీయులు సల్పిన పాతకంబు
భరతమాతను దాస్యంబుపాలొనర్చె.

ఇంక నెంతకాలము కన్నులు మూసికొని దాస్యమహాంబుధి మునిఁగి
యుగచాట్ల నందవలయు ?

లోభ—లేనిపోని శ్రీరంగనీతులం బల్కుచు నీవంటి తెలివిమాలినవా
రుద్యోగంబులను మాని నిరర్థక జీవనంబులను సల్పిన దేశంబు
నకు దరిద్రముగాదా !

అదృ—సోదరా! హిందువులు కొందఱు సర్కారువారి యుద్యోగము
లను మానినందువలన నాదేశము దరిద్రంబు పాలైనది !—
ఇట్లు విపరీతముగఁ బలుకనేల ?

సీ. ఖద్దరువస్త్రము లట్టులే మాని మాన్
 ఛెష్టరుగుడ్డ కాశించినాము
ఘనమైన చెకుముకియును గృహాగ్నియు మాని
 యగ్గిపెట్టె జపాను నడిగినాము
నవధాన్యములు పండునవని నుపేక్షించి
 దాస్యంబుసేయ సిద్ధపడినాము
అభిమానములు మాని యాత్మగౌరవమెల్ల
 నధమంబు బిరుదుల కమ్మినాము
చేతితో నల్లవస్తుప్రల్ జేసికొనక
భ్రాంతి నడ్డమైనవిదేశవస్తువులను
కొని మనధనంబు వెచ్చించి కోట్లకొలఁది
తీరని దరిద్రమును కోరి తెచ్చినాము.

లోభ—నీయుపన్యాసములను నేను లక్ష్యముచేయను; నిరుద్యోగివై యింటఁ గూర్చుండి, ముప్పూటలును మేయుచు మరుకొనుచుంటివి కాఁబోలును. నీ వుద్యోగముచేయువేని నీ కొక్కకబళమన్నము వేయువాఁడను గాను. అదిగాక, దేశమునందంతట దొంగతనములు విశేషముగ జరుగుచున్నవి వాని ససహాయవాదులు గావించుచున్నవారని ప్రతీతిగ నున్నది. నీవిట్టి ప్రవర్తనము గలవాఁడవేని, నీకు కారాగృహప్రాప్తి తప్పదు. నీకొక్కవారముదినములు గడు విచ్చితిని. ఈలోన నేదియో యొకటి స్థిరపఱచుకొని చెప్పుము........చతురా! నీ వీ యభాగ్యుని బోధలందుఁ జిక్కి రాట్నమును విడువకున్నావు; రాట్నమును విడువకుంటివా నీ మర్యాదయును దక్కదు. జాగ్రత్త. (నిష్క్రమించును.)

అదృ—చతురా! వింటివా యీమూర్ఖుని మాటలు!

చతు—కటకటా! ఎచ్చటనో దొంగతనములు జరుగుచున్నవఁట! వాని ససహాయవాదులు చేయుచున్నారని యనుమానమఁట! ఎంత పాపము!

అదృ—ఈకళంకముల దీర్చుకొనుటకైన నాచోరులకొఱకు ప్రయత్నింపవలసినదే! కాని యీనాటి యసహాయవాదులకు శాంతితత్త్వము బోధపడకుండు టెంతయు నుద్యమమున కవరోధకారణముగ నున్నది చూఁడు—

గీ. ధృతి నుపన్యాసపీఠంబు లెక్కవచ్చు
నింపు దీపింపఁగ నుపన్యసింపవచ్చు
తిన్నగా రాట్నమున నూలు నేయవచ్చు
గట్టిఖద్దరువస్త్రము లట్టవచ్చు
దండియుద్యోగ మాసింప కుండవచ్చు

తగిన యాత్మగౌరవమును దాల్పవచ్చు
విశ్వభారతిసేవ గావింపవచ్చు
పూని పరదేశవస్తుత్యాగ మ్మొనవచ్చు
కాని, భీషణవిలయ దుష్కాలమందు
నగ్నివర్షముల్ గురిసెడు నదనునందు
చటులగతి ఫిరంగులు పేలు సమయమందు
వివిధదండాహతులు గల్గు వేళలందు
విమలసత్యాగ్రహావిష్టావేశముునను
శాంతమును దాల్పఁగల్గిన సత్పురుషులు
కొలఁదిగా భూతలంబున వెలయుచుండు
రఖిలహైందవులును శాంతి నందునాఁడె
సకలభారతీయస్వారాజ్యంబు గలుగు.

చతు—మీయుద్యమము హృద్యముగ నున్నది. కాని, మీరన్న గాదు మిమ్ము గృహత్యాగులం జేసినచో మీరమితకష్టములు ననుభవింతురేమో కదా!

అదృ—వెఱ్ఱివాఁడా! ఇందులకా విచారము!

సీ. జాపలోపల నున్నమండూకములకు నే
యకళంకమూర్తి యాహార మిచ్చె
అంతరాళంబుల నల్లాడుపులుగులు
తినుట కేపరమాత్మ తిండి నిచ్చె
కాననంబున వృద్ధి గాంచి మిన్నందు వృ
క్షంబుల కెవఁడు నీరంబు లిచ్చె
జనియించినంతనే జననిపాత్రిళ్ళలో
శిశువుల కెవ్వాఁడు క్షీర మిచ్చె

నట్టిలోకనాథుఁ డవ్యయుఁ డప్రమే
యుండు జీవనాయకుండౌ నన్ను
జనన మందఁ జేసి మనుమార్గమును జూప
కెటుల సంహరించు నిందువదన.

కావున నింక మన కావిచార మక్కఱలేదు. మన మింక పోవుదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.





ఆలీబాబా

అను

# అదృష్టవిజయము

## ద్వితీయాంకము

### లోభగుప్తుని యిల్లు.

[ప్రవేశము:— లోభగుప్తుడు, ప్రమద]

ప్రమ— నేను నాల్గు దినములు పుట్టినింటికి వెళ్ళివచ్చునప్పటికి కొంపలో నింతయల్లరి యేమి?

(అనుబంధము 1.)

లోభ— నేను చేసినయల్లరి యేమున్నది?

ప్రమ— చతురను రాట్నము మానుమని మీరు మిగుల నార్భాటము చేయుచున్నారట కదా!

లోభ— ప్రమదా! నీకు నయితము రాట్నముపై నింత వెఱ్ఱి యేల?

ప్రమ— మీకు విరోధ మేల?

లోభ— నేటి మన ప్రభుత్వమువారి కాగ్రహము వచ్చునని నేను రాట్నమును నిరాకరింపవలసివచ్చినది.

ప్రమ— మీమాటలను విన్నకొలదియు నాకు పరమాసహ్యముగ నున్నది; మీరు విందులకొఱకని బహుమానములకొఱకని వ్రయము చేయు ధనమునకు మితియున్నదా?

సీ. దొరల విందులకని, మఱియుచు వేయిరూ
ప్యముల నొసఁగ వెచ్చపఱచినారు
కిసిమిసిలోన విస్కీబుడ్ల కింకొక్క
వేయిరూకలు ఖర్చుపెట్టినారు
పందితోడలకని వైనుదొట్టెలకని,
మించినధనము వెచ్చించినారు
డాన్సింగుపార్టీహడావిడులకు నొక్క
సంచి చందాల నొసంగినారు
పేరునకు రావుబహాదూరుగారె కాని,
లెక్కయేలేదు వ్రయమగు రొక్కమునకు
రావుబహదూరు లగునవ నాధమునకు
నిచ్చుచున్నారు ముడుపుల నిట్లు మీరు.

**ఈది**క్కుమాలినబిరుదు లేల? వానికై మనకీఖర్చు లేల? ఇది లేనివారి పనియే శ్రేయముగ నున్నదిగదా! రావుబహద్దరుగారని రాబడిపన్ను తగ్గినదా. వోట్లసమయము వచ్చినప్పుడు నోట్లు చెల్లక పని గడచినదా? అదిగాక, మీ కీబిరుదు వచ్చినతరువాత మన కూరిలోనివా రెందఱు విరోధులయిరో తెలిసికొంటిరా?

లోభ—విరోధులై నన్నూరిలోనివా రేమిచేయఁగలరు? నేను తలంచుకొన్నచో నాకువిరోధియైన ప్రతివానిని మట్టుపెట్టింపఁగలను.

ప్రేమ—అట్టిపనులుచేసి ప్రజావిరోధమును మఱింత బలపఱచుకొనఁజూచుచుంటిరా? కానిండు. మీపనులతో నాకు నిమిత్తము లేదు; మీరు వ్యర్థముగ ధనవ్రయము చేయుటకుమాత్రము నేనొప్పను. ఈసారి దొరలకని దొరసానులకని యింటిలోని రాగిదమ్మిడీయయినను ఖర్చుపెట్టనిచ్చుదానను గానని తెలిసికొనుఁడు.

లోభ—సరే! నే నిట్టికర్జ్ములు చేయునుగాని, చతురచేత రాట్నమును మాత్రము మాన్పింపఁగలవా ?

ప్రేమ—ఒక్కనాఁటికి మాన్పింపను. ఈసన్నగుడ్డల కంతంతధన మేల వ్యయముచేయవలెను? క్రిందటిసంవత్సరము చతుర యొడికిన నూలుతోడనే మాయందఱిబట్టలను నేయించుకొంటిమి. ఏదో విధమున ధనమును కూడబెట్టవలయునని నేను ప్రయత్నించుచుండఁగా నది మేలతరుగదని మీరు విచారించుచున్నారా? అది గాక దిక్కులేనిదిగదా యని నేను చతురం దెచ్చి యింటఁజేర్చగా మీకు దానిపై దుర్బుద్ధిగలిగినదని నే నిదివఱకే గ్రహించితిని. అట్టి వెఱ్ఱివేషములు వేసినచో మీ రావుబహద్దరు పెద్దతనమును నడువీధి కెక్కించెదను. తెలిసినదా ?

లోభ—ప్రేమదా! నాకా! దానిపై దుర్బుద్ధియా! ఎంతమాటెంత మాట! నాతమ్ముఁ డదృష్టగుప్తుఁడుగాని దానితో సరసము లాడునది నేను గాదు.

ప్రేమ—అన్నట్లు చెప్పవచ్చినమాట మఱచితిని. మనకొంపపై గవ్వ యాదాయముగాని గడియతీరికగాని లేని మీతమ్ముఁడొకఁడు తిని తిమ్మరాజువలె తిరుగుచుండు టేమి? అతనికి త్వరలో నుద్యోగము చెప్పినచో మన కెంతయో కర్చు తగ్గును.

లోభ—నేను సంగతులకే సమయమునకై యెదురుచూచుచున్నాను. ఉద్యోగముచేయుమని చెప్పఁగా చేయునని యేమేమో పెద్దకూతలు కూసినాఁడు; ఒకవారముదినములలోపల నేదోయొకటి స్థిర పఱచుకొమ్మంటిని. ఉద్యోగముచేసెనా మనకు లాభమే- చేయఁడా యింటనుండి గెంటివేసెదను.

ప్రేమ—ఆతని ముందుకానిండు

(నిష్క్రమింతురు)

లోభ—బ్రదికితినిరా దైవమా! ఏమిచిత్రిమో భర్తనయ్యును-నా యెదుట నిదియున్నంతసేపును నాగుండెలు కొట్టుకొనుచునే యుండును. నేనే యననేల?

గీ. రాజసభలందు ప్లాటుఫారములయందుఁ
జేరి ధణధణ లాడించువారిలోన
మూడువంతులు కొంపలో ముదితగీచి
నట్టిగీటును దాఁటలేనట్టివారె.

ప్రమద చెప్పిన యన్నివిషయములకన్న చతురవిషయమే—నామదిని మిగుల వేధించుచున్నది. దీనిసుందరాకారముం జూచినప్పటి నుండియు నాహృదయము మదనతాపవశమై మఱుగుచున్నది. కాని చండశాసనురాలగు నాసతిని దలంచినచో నామాట యెత్తుటకే భయమగుచున్నది. ఈనడుమ నిది పుట్టినింటికిఁబోయి నప్పుడు పిలగుననుకొంటిని గాని నాకు క్లబ్బులోని పార్టీలతో డనే కాలము సరిపోయినది. ఆహా! చతురసౌందర్యము!

సీ. వెడఁదలై నిడుఁదలై వెలయుకన్నులలోన
చాంచల్యమునుఁ జూపు మించుబోణి
నవమోహనంబుగ నవ్వినఁ జెక్కిళ్ళ
చిఱుతగుంటలుగల వరకపోల
అంటిన పసివాఁడు నను విభ్రమము గొల్పు
నవనవాంగకముల చివురుబోఁడి
మునులనేనియును సమ్మోహసాగరమున
ముంచునందముగల్గు నంచయాన
పొడవుగాక మిగుల పొట్టియునుంగాక
తగినరూపు గల్గు సొగసులాడి

దీనిమీఁది దాని దీనియానగుదాని
నింతవఱకుఁ గాన నింతులందు.

దీనిని వశముగావించుకొని యానందించు భాగ్య మెట్లుగల్గునో నాకేమి యుఁ బాలుపోకుండనున్నది. అదృష్టగుప్తునిపై దీని కించుకయను రాగ మున్నట్లున్నది. కాని యింతటితో వాఁడే నాగృహము నుండి విరుగడయై పోవనున్నాఁడు గదా ! ఇంక నా కావిచార మేల? ..........జాము రాత్రియైనట్లున్నది. క్లబ్బునకుఁ బోయి రెండుపెగ్గులవిస్కీ గొంతుదిగజార్చితినా యిందులకేదేనియాలో చనము తోఁపఁగలదు. ఈదినములలోన క్లబ్బులోన విస్కీత్రా గుట ఘనకార్యములలో నొక్కటియైపోయినది.

సీ. పలువురు గొప్పవారలతోడ స్నేహంబు
గలిగింపఁగా సహకారి యగుచు
దొరలతోనైనను వెఱవక స్నేహంబు
చేయింపసాధనోపాయ మగుచు
నెట్టిచింతలనైన నిట్టె మాయంబొన
ర్పఁగదగునౌషధప్రాయ మగుచు
మదిన ధైర్యంబును మాయించి నిర్భర
ధైర్యంబొసఁగ వరదాన మగుచు
భాసురానందదివ్యవారాసిఁ దేల్చు
స్నేహితునివంటి దైనవిస్కీరసంబు
నింతచవిజూడఁ గ్లబ్బున కేగకున్న
వాఁడు నవనాగరికుఁడు గాలేఁడు నేఁడు.

(నిష్క్రమించును)

యు రంగము.

[కరటకుఁడు విస్కీబుడ్డితో ప్రవేశించును.]

కర— పాట.

హాయిహాయీ మహానందసందాయీ।
బహుమాయా మయముగద సారాయీ॥ హాయి॥
లోకంబుమరపించి । శోకంబుమాయించి ।
ధైర్యంబు దెప్పించుగా ।
హాయ్‌హాయ్ - శౌర్యంబునిప్పించుగా
గాలిలోన । స్వర్గమంత । గానుపింపజేయుగా ।
మేలౌబ్రహ్మజ్ఞాన మిప్పించుగా॥ హాయి॥

పార్శీవోడి షాపుకెళ్ళి మెనిమిదిరూపాయలిచ్చి విస్కీబుడ్డి రహస్యంగా తెచ్చి నాకిమ్మని బాబుగారు లోభగుప్తుఁడుగారు చెప్పినారు. ఇది పెద్దమ్మగారి కంటబడఁగూడదట ! నామ్మట్టుకునాకు— దీన్నిచూడగనే కళ్ళుమూసుకొపోయి నోరూట లూరుచున్నది. మెల్లగా మూతవిప్పి సగం తాగేసి కాళీలో నీళ్ళు భరాయిస్తే కనుక్కునే వాళ్లెవళ్లు ? బాబుగారికి నిషాచెయ్యకుంటే యిం కొకబుడ్డి తెప్పిస్తాను! లెక్కేమిటి? నిర్భాగ్యపు ముండకొడుకు మాదమనకుఁ డెక్కడికో చస్తాడు- సమయాని కక్కసపడేఁడు- తాగుబోతుకు తోడులేకుంటే కష్టం—ముండలముతాకోరుకు తోడుంటేకష్టం-(బుడ్డి మూతివిప్పుచు) ఈమూలగదిలో కెవ్వ రూరారు. నాయిష్టమే యిష్టం- నేనూ చూస్తూవుంటానుగదా గొప్పోరు గొప్పోరనటమేకాని గొప్పోరేంతాగ్గలరు? నాజూకు గా అరగ్లాసుతాగేటప్పటికే పరలోకం కళ్ళజూచి కళ్లు తేలేస్తారు అయినారమ్మసారాయి ముందర విసికీ బ్రాందీ-నిషాలేని చెత్త సరుకు—నోటికి గాటేవుండదు. ఇటువంటి సరుకు—తెండు.

మూడుడ్రాము లయితే ఆపోదు. బుడ్డిబుడ్డి పూర్తిగా తాగే
స్తే ఏదో కొంచెం—చిమచిమ లాడుతుంది. గొప్పో రిందులో
సోడాలు లిమినేడ్లుకూడా కలుపుతారు—చప్పగా గాటుచచ్చి
పోవడానికి—తాగడమంటే వాళ్ళకేం తెలుసును. (బుడ్డిత్రో
దాగ్రివి) మొత్తానికి రమ్ముకంటే కొంచెమసహ్యం తక్కువ—
అసహ్యంతక్కువే-అసలుపనీ తక్కువే- తాగేవోళ్ళంతాయి
నండిబాబూ! ఎనిమిది రూపాయిలుబెట్టి- యిసికీతాగటంకంటే
ఎనిమిదణాలుబెట్టి- కమ్మగా రమ్ముసారా తాగటం తెలివైన
పని. ఇప్పుడు చాలామంది గొప్పగొప్పో రాపనేచేస్తున్నారు;
తాగేటప్పుడు కొంచెం కళ్ళుమూసుకుంటే రమ్ముసారా
దీనమ్మమొగుడు పనిచేస్తుంది- ఇప్పటికే పిలకట్టుకుంది రాబాబూ-
పట్టుదప్పకుండ మరికొంచెమిప్పుడే బిగిస్తాను. (మరికొంత త్రాగి)
అసహ్యమంతా మొదటిసారే-కాని, నిషాచేశా కొంతతాగినా
పానకమే- ఇంత తాగానుగన కీమాత్రం పనిచేసింది. (బుడ్డి
చూచి) చాలాతాగేశాను బాబుగా రేమంటాడో! ఏమం
టాడు? బుడ్డితెస్తాంటే చేయిజారి పగిలిపోయిందంటాను.
(తలవిసరుట సూచించి) రెండోసారి తాగిందంటుకుంది. ఇప్పుడు
చూడరా నాసామిరంగా నాతమాషా-ఇప్పుడు హరిహరాదు
లొచ్చినా నన్నాపలేరన్నమాట- దమనకుడుగాడుంటే పాప
మింకొంచెం తాగేసునుగదా! దురదృష్టపు గాడిదకొడుకు.

పాట.

సారాయిదాగితే స్వర్గమ్మురా । యేవి ।
కారమ్ములేకుండతాగండిరా॥ సారా॥
కిందేడులోకాలు । మీదేడులోకాలు ।
గాజుసీసా చిన్న కంతాన జూడరా॥ సారా॥

ఈతకల్లంటేను పాతదైవమురా ।
తాటికల్లంటేను తల్లిగాదంట్రా ॥
రెండుపూటలు కల్లు వొకపూట సారాయి।
దండిగా తాగేసి । తందనా లాడరా॥ సారా॥

[ప్రమద ప్రవేశము.]

ప్రమ—ఈమూల నెవ్వఁడో వెఱ్ఱికేకలు వేయుచున్నాఁడు. (దగ్గఱకు వచ్చి) ఏమియిది. కరటకుఁడు-అబ్బ-ఏమి యీదుర్గంధము-సందేహ మెందులకు? తెగత్రాగుచున్నాఁడు; వీని కీయింగ్లీషు సారా యెక్కడిదో: వీఁ డిప్పు డీప్రపంచమున లేఁడు. ఈ సమయముందే వీనినోట కొంత ప్రేలింపవలెను. కరటకా! —కరటకా !—

కర—(కన్నులు మూసికొని తూఁగుచు) ఎవఁడురా అది ? దమనకా !

ప్రమ—(స్వ) వీఁడు నన్ను దమనకునిగ భావించినాఁడు. నేను నటులే నటించెదను. (ప్రకాశముగా) ఓరీ ! కరటకా ! నేను లేకుండ త్రాగుచున్నావా !

కర—హేహేహేహే ఎర్రిముండకొడకా ! నీకు లేకుండ తాగుదు నటరా! నీవు లేవని బెంగెట్టుకుని నస్తూంటే నిష్టూర మేస్తున్నావా! దొరంటు తాగే యిసికీ- కొంచెం రుచిచూడు-

ప్రమ—కరటకా! బాబుగా రింకా జీతమైన నివ్వలేదే? నీ కీ విస్కీ యెక్కడిది ?

కర—(తూఁగుచు) ఎనిమిది రూపాయి లిచ్చి సొంతానికి నాచేత తెప్పించారోయి యెదవనాగన్న-

ప్రమ—కరటకా ! బాబుగారు విస్కీ త్రాగెదరంటరా !

కర—(తూఁగుచు) అబ్బో! విచిత్రాలు నేర్చుకున్నావు లేరా! నువ్వె

న్నిసార్లు పెమిదెబ్బిగారి కొరక లేకుండ తెచ్చియిచ్చావు గాదురా ?

ప్రేమ—అవునవును. నేనూరకే యుంటిని; కాని యిప్పుడు ప్రత్యేకము గా బాబుగారీవేళ నేల తెప్పించిరి?

కర—(తూగుచు) ఇదిగో ! మనలో మాట రహస్యంసుమా! ఈరాత్రి అంతాపండుకొన్నతరువాత, చతురతోటి మాట్లాడి దాన్ని లోబరుచుకుంటాడట ! రవంతధైర్యంకోసం యిస్కీ తెప్పించాడు.

ప్రేమ—చతుర సమ్మతించినదా?

కర—ఏమో ! నన్ను వాగించకురా ! మనస్సు తిన్నగా లేదు. బుడ్డిలో నింకేమయిన మిగిలినదా?

ప్రేమ—ఆ ! ఇదిగో ! (ఇచ్చుచు)

కర—(త్రాగి) నాకు నిదరొస్తుంది. లేపకురా. (పరుండును.)

ప్రేమ—(తనలో రోషముతో) ఏమి ! చావు తుదకు లావుదుఃఖమని నట్లింతకాలమున కీయనకు చతురపై భ్రాంతిగలిగినదా! ఈప్రమద గుడ్డిదనుకొనియెనా? నానోరునొక్కి యొకమూలఁబడవైచి స్వతంత్రముగ చతురతో నేకచ్ఛత్రాధిపత్య మొనరింపఁదలంచెనా ! ఈసౌభాగ్యమునకు త్రాగుడొకటి యభ్యాసమైనదా ! నే ననుమానించుచునే యుంటిని. కాని యిప్పాతనిసంగతి కనుగొందును

(అనుబంధము 2)

(నిష్క్రమించును.)



## తృతీయరంగము.

### లోభగుప్తుని మందిరము.

[చతుర రాట్నము త్రిప్పుచుఁ గూర్చుండియుండును.]

(అనుబంధము 3.)

చతు—(విచారముతో) అకటా! నాస్థితి క్రమక్రమముగ నపాయము గఁ బరిణమించుచున్నది. నేనేమి సేయుదును? నేఁటిసాయంకాల మున, లోభగుప్తుఁడు నాకడకువచ్చి-నాపైఁ దన కమితానురాగ ముగలదని-తన్ను ప్రేమింపుమని పల్కి- నిర్బంధింపఁబోయి యం తలో-ప్రమద యచ్చటికివచ్చుటచేత—నన్ను వదలి చనినాఁడు. తల్లిదండ్రులు గతించినకతమున, నీప్రమద నన్ను పెంచిపెద్దదా నింజేసి ననినమాటయే కాని, నేను కేవల నిరర్థకజీవననైతిని గదా! దేశమంతయు నాందోళనమునందుండ-నిరర్థకురాలనగు నావలన దేశమున కుపకారలేశమైన లేదు గదా! ఏలనాజీ వితము?

మ. చరకా ద్రిప్పుచు, దేశమాతపయి భాస్వద్దీతము ల్పాడుచున్
పరమానందమునన్ స్వరాజ్యనిధికై పాత్రంబు చేఁబూనుచున్
సరవిన్ హిందుజనప్రబోధమునకై సంచారముం జేయుచి
క్కరణిన్ భారతమాతఁ గొల్వనగుభాగ్యం బెప్డు చేకూరునో.

ఆహా! దేశసేవచేయని జన్మము జన్మమా!

సీ. ఆశాంతరము లంట దేశసంకీర్తన
నోరునొవ్వఁగఁ బాడనేరఁ డేని
పూని చేతులు నొప్పిపుట్టునందాక
ప్రత్తి రాట్నపునూలు వడకఁడేని
కాంగ్రెసుచందాలు గణియింప పాదము
లరిగెడునందాక తిరుగఁడేని

సరసవాక్యములతో శాంతితత్వమును దే
శంబున నందందుఁ జాటఁడేని
ప్రేమ దేశీయవ్రత మాచరింపఁడేని
చేరి హైందవలక్ష్మిఁ బూజింపఁడేని
వాఁడు భారతమాతగర్భంబుఁ జెఱుపఁ
బుట్టినట్టి యభాగ్యుఁ డీపుడమిలోన.

(గడియారము పదునొకండుకొట్టుచున్నది.)

అబ్బ! ఆలోచనం దవిలి పొద్దే యారయనైతిని. చాలరాత్రి యైనది. ఇంక వెళ్ళి పండుకొందును. నేఁటిరాత్రి యేమి హేతువు ననోకాని యన్నదమ్ములిద్దఱును గృహమునకు రాలేదు. ప్రమద నిద్రించుచున్నది.

[అదృష్టగుప్తుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

అదృ—చతురా! నీవింకను మేల్కనియే యుంటివా! చాలరాత్రి మీఱినది కాదా!

చతు—మీకుగాని రాత్రి నాకైనదా!

అదృ—నేనిఁక నేఁటితో గృహత్యాగినై పోవలసినవాఁడనేకదా! నాకు దివారాత్రి విభాగముతోఁగాని సుఖముతోఁగాని యేమిపని యున్నది?

చతు—ఆర్యా! పిత్రార్జితమగు నైశ్వర్యముగల సమిష్టికుటుంబము గదా మీది; మిమ్మింటినుండి పొమ్మను టాతనికి ధర్మమేనా?

అదృ—ఈదినములలో సామంతమే ధర్మము.

చతు—లోకులు మీసోదరుని దూషింపరా?

అదృ—లోకులకు వెఱచువాఁడైనచో నిట్లు ప్రవర్తించునా? ఇప్పుడేమి చేయుచున్నాఁడో యెఱుఁగుదువా?

చతు—ఏమిచేయుచున్నాఁడు?

అద్రు—రైలుస్టేషనులోని రిఫ్రెష్మెంటురూములో తనశరీరమును తా నెఱుంగకుండ నున్నాడు.

చతు—కటకటా! ఈ మధుపానభూత మాతని నెట్లావహించినదో కదా! తాగుబోతు లెంతబుద్ధితక్కువవారు!

సీ. వరనిర్మలాంబుసేవనముననే కదా
మాతంగతతి బలోపేత మయ్యె
జలపానమునఁ గదా శాంతస్వరూపగో
మాత సుక్షీరప్రదాత యయ్యె
తుహినపావనవారిదోహదంబునఁ గాదె
క్షితిరుహంబులు ఫలాన్వితము లయ్యె
నీరు ద్రావుటఁ గాదె నింగి వ్రేలుచు మేఘుఁ
డింపుగా నవని వర్షింప నయ్యె
నఖిలజీవనముల కాధార మై నీర
మమరుచుండ జనము లాశతోడ
గారవంబు ధనము నారోగ్యము హరించు
మధువు ద్రావుచుందు రధము లగుచు.

అద్రు—చతురా! ఎన్నిప్రయత్నములుచేసినను మనదేశ మీమధుపానభూతమును వదల్చుకొనలేదనియే తోఁచుచున్నది.

చతు—సరిగాని—మీ రీగృహమును వదలినపిదప నెందుఁబోవుదురు?

అద్రు—నాజీవనమునకా విచారము!

గీ. దేశమంతయు మద్యశాధీన మగుచు
భూరికల్లోలవారిధి మునిఁగినపుడు
భారతీయునికర్తవ్యభార మేది
దాని నొదల సంప్రీతిఁ దాల్చువాఁడ.

చతు—అట్లైన నా దొక్కకోరిక యున్నది. మీ రాలకింపవలయును.

అదృ—అది యేమి?

చతు—ఈ దుష్టగృహంబునుండి వెలువడి, యానందముతోడ దేశారా
ధనము గావింపవలయునని యున్నది.

అదృ—ఆఁడుదానవు నీ వేమిచేయుదువు?

చతు—ఆఁ! అదేమిమాట! ఆఁడువారలు మనదేశమం దెందఱు దేశ
సేవ చేయుటలేదు.

సీ. భారతమాతృసేవాధీన గాదె యా
పావని కస్తూరిబాయిగాంధి
రమణులకెల్ల మార్గప్రదర్శక గాదె
నిర్మలాఖ్య సరోజినీమతల్లి
సకలంబు దేశసేవకు రోసె వరభక్తి
పూర్ణ యా మనయన్నపూర్ణమాంబ
కులవృత్తి మాని నిష్కలుష సేవావ్రతం
బును బూనె యామినీపూర్ణతిలక
యెందఱెందఱో మనదేశమందు నిప్పు
డబలలే కార్యరంగమం దవతరించు
చున్నవారలు గాన నాయోపినంత
సేవ గావించి సార్థకజీవి నగుదు.

అదృ—నీయుద్యమము శ్లాఘాపాత్రమే కాని—ఎవరది? ఓహో! నా
యన్న మధుపానవశమున తూలుచు నిట్లు వచ్చుచున్నాఁడు.

చతు—ఎంత ఘోరము!

[లోభగుప్తుఁడు మధుపానము చేసి ప్రవేశించును.]

లోభ—ఓహో! అర్ధరాత్రమున మీ రిద్దఱు నిందుఁ జేరి శృంగార
నాటక మాడుచుంటిరా!—వినాశకాలము! ఓరీ అదృష్టగుప్తా!
నీ వుద్యోగము చేయునది చేయనిది నిర్ణయించి చెప్పవలసినది

నేఁడే. వింటివా! హే హే హే హే-నీకు చతురపాదములకు సేవచేయు మహోద్యోగము లభించినదికాదా! ఇంక వే మేల?

[ప్రమద చాటున ప్రవేశించును.]

ప్రమ—(స్వగ) కరటకుఁడు చెప్పినదంతయు జరుగుచున్నది. కానిమ్ము. అదృష్టగుప్తు నింటనుండి వెడలఁగొట్టనీ-తరువాత నీతఁడు చతురపై చేయివైచినప్పుడు బయల్పడుదును. (చాటున దాగును.)

లోభ—ఓరీ! మాటాడవేమి? సన్నిపాతజ్వర మేమైన నావేశించినదా!

ప్రమ—(తనలో) మధుపానసన్నిపాతము ని న్నావేశించినది.

అదృ—సోదరా! ఈనిష్ఠురవములతోఁ బనియేమి? నే నుద్యోగముల కాశించువాఁడను గానని యెఱింగియు పలుమారులు ప్రశ్నింప నేల?

లోభ—అట్లయిన నీనడిరేయి గూ నాయింటనుండి కదలవచ్చును.

అదృ—సోదరా! మధుపానమత్తతచే నొడలెఱుఁగకున్న నీకు నే నేమిచెప్పఁగలను? కాని,

క. మనతండ్రి గణించిన పీ
ఘనసంపద లెల్ల నాకుఁ గలదర్ధము నీ
వనరాదు నాకు లే దని
యనుజా! న్యాయంబు సలుపుమా దయతోడన్.

లోభ—ఏమేమీ! ఇందు నీకు భాగముగలదా! ఇది మనతండ్రి గణించిన దనియా నీయభిప్రాయము! మనతండ్రియాస్తి యించుక చిల్లి గవ్వంతలేదు. ఉన్నదానిని నిర్వ్యాపారివై చిన్ననాటనుండియు నీవే తిని పాడుచేసితివి. ఇది నాస్వార్జితము! పెట్టెయాళలు పెట్టుకొనక కదలుము.

ప్రమ—(తనలో) తాగియున్నను చక్కగాఁ జెప్పినాఁడు.

అదృ—(కన్నులు మూసి) పరమేశ్వరా! నా కీగతిఁ దెచ్చితివా! ఈ ప్రపంచసముద్రమున నేకాకింజేసి న న్నేమిచేయఁ దలంచితివి?

లోభ—ఇంక నాలోచించుచు నిలువఁబడియుంటి వేమి? కదలెదవా లేదా?

అదృ—సోదరా! నీయుద్దేశమట్లున్నప్పుడు, నేనెట్లు మారుపల్కుదును? కాని ధర్మాధర్మములను బరీక్షించు పరమేశ్వరుఁడు నీ యన్యాయకృత్యములకు నీ కేమస్థితిఁ గలిగించునో యని మిగుల విచారించుచున్నాను.

లోభ—దుర్మార్గుఁడా! ఏమంటివి! నన్ను భగవంతుఁడు శిక్షించునని-నేను పాపాత్ముఁడనని యాక్షేపించుచుంటివా! కదలెదవా-గెంటనా?

అదృ—నీ కామాటయు కష్టమైనదా! కానిమ్ము పోయెదను. సోదరా! సెలవు. అసహాయుఁడను నీ సోదరుఁడను. అర్ధరాత్రమున నింట నుండి గెంటుచుంటివి! ఇందులకు నీ కేనాఁటికైన భగవంతుఁడు పశ్చాత్తాపముం గలిగించునుగాక! నా కాపరమేశ్వరుఁడే శరణ్యము.

ఆ సవతితల్లియూన భవనంబు వెలువడి
నట్టి ధ్రువున కెవ్వఁ డార్తిఁ బాపె
నట్టి దేవదేవుఁ డాద్యంతశూన్యుఁడే
కాచుఁ గాక నాకు గాసి దీఱ. (నిష్క్రమించును)

చతు—(తనలో) ఆహా! ఎంతశాంతమూర్తి వెడలిపోవుచున్నాఁడు.

ప్రేమ—(తనలో) ఇప్పు డీత్రాగుబోతు చతురపై నత్యాచార మాచరింపఁగలఁడు. కావున నేను జాగరూకనై యుండవలెను.

లోభ—హే హే హే హే—నాకొంపనుండి శని వదలిపోయినది. చతురా! ఎన్నిేళ్ళకు నా కొంటరిగ దొరికితివి. ఇఁక నీవు

నన్ననుగ్రహింపక పోవ. అటగో మొగము చిట్లించుకొనుచు న్నావు! వాడగ్గఱ వాసన వచ్చుచున్నదా యేమి? ఈవాసన రాకుండ, నీకొఱకే రెండుసెంటుబుడ్లను గుడ్డలకింత పూసి కొంటిని. ఇంకను వాసనయేనా ?

గీ. కీచకుని ద్రౌపది దయను జూచినట్లు
సీత రావణు ధన్యాత్ముఁ జేసినట్లు
అల కిరాతుని దమయంతి యరసినట్లు
నన్ను దయఁజూడరాదటే సన్నుతాంగి.

మొగ మట్లు ముడిచినావేమి? ఇది యంతయు త్రాగిన ప్రేలాపన మను కొనుచున్నావా? నన్ను చంపుకొని తినినంత యొట్టు—కొంచె మానందముకొఱకు విస్కీ సేవించినమాట నిజమేకాని, నేను మంచి వ్యక్తిలో నున్నాను. పొరపాటేమియును లేదు.

చతు—అయ్యో! న న్నొంటరిదానిం జేసి యిట్లు చేయుట నీకుఁదగునా?

లోభ—ఏమి? ఒంటరిదానవా ! నేను దండనుండఁగా నొంటరిదాన వయ్యెదవా? (దగ్గఱకుఁ బోవును.)

చతు—(తప్పుకొని) నన్ను పెంచి పితృసమానులైయున్న మీ కీదుర్వాంఛ కూడదు. (అనుబంధము. 4)

లోభ—హే హే హే—చతురా! నీకు బొత్తిగా శాస్త్రజ్ఞానము లేన ట్లున్నది. అడ్డదిడ్డముగ మాటాడుచున్నావు! నేను నిన్ను పెంచి నంతన తండ్రి ననుచున్నావా ?

గీ. తేమగో! నిన్ను పెంచుట లెక్క యేమి?
చేర్చి మనలనందఱను సృష్టించినట్టి
బ్రహ్మయే కన్నబిడ్డను భారతిని, ర
రమించె ననిపల్క వినవె యోషించుబోణి.

అంతటివాఁడాపనిచేయుఁగా నందువలన మన కేమిదోషమున్నది ?

ప్రమ—(స్వగతము) పాండిత్యము క్రమముగ ముదిరి తలకెక్కుచున్నది.

లోభ—ఏమియాలోచించుచున్నావు? సమ్మతియైనదా ?

చతు—వాంఛయే లేని, నన్నేల బాధించెదరు?

లోభ—అబ్బ! ఎంతజాణతనము చూపుచుంటివి? వాంఛ గింఛ యని సంస్కృత ముపయోగించుచుంటివే! అంతవాంఛయే లేని దానవైనచో-అదృష్టగుప్తునితో నాగునగుస లేమి? అర్ధరాత్రి మున రాద్ధాంతసిద్ధాంతము లేమి? అదృష్టగుప్తుఁడు నీ కైశ్వర్య వంతుఁడయ్యెనా! నేను దరిద్రుఁడనైతినా! వాఁ డందగాఁ డయ్యెనా! నే ననాకారినైతినా ? వాఁడు సరసుఁడయ్యెనా! నేను విరసుఁడనైతినా? అబ్బ! తనకు వాంఛయే లేదఁట!

ప్రమ—(కోపముతో తనలో) వీని సరసముమండ! ఇంతకాలమునకు సరస మారంభించి నాఁడు. నా కన్నుల యెదుట నే యొకతొత్తుతో సరసమా! పోయి నోటిమీఁదఁ గొట్టుదునా?

చతు—మహాశయా! దిక్కులేని నన్నిట్లేల దుఃఖింపఁజేసెదరు? మీ దారిని పోయి పండుకొనుఁడు; ఇది చూచిన ప్రమదాదేవి యాగ్రహించును.

లోభ—(వికటముగ నవ్వి) ఏమేమీ! ప్రమద పేరు చెప్పి నన్ను బెదరించుచుంటివా? ఆ వెఱ్ఱిభ్రాంతి మానుము. అదిగాక, దిక్కులేని దానవను దుఃఖమా నీకు? ఆదుఃఖ మదృష్టగుప్తుఁ డిల్లు విడిచి పోయెననియేనా? నే నెఱుఁగుదును లే-నాదగ్గఱ లేనిపోని బెట్టు సరులు చేసితివా నిన్నిప్పుడే బలవంతముగఁ గౌఁగలించుకొందును. (కౌఁగలింపఁబోవును.)

చతు—(పెద్దగా నాక్రందించుచు) హా! దైవమా! నన్నిప్పు డెవ్వరు రక్షింతురు!

ప్రియ—(ప్రవేశించి విడదీసి) ఏమీ యర్ధరాత్రిమున నీ గంధ్రిగో శము! మీరిద్దఱు నిచ్చట సరసములు ప్రారంభించినారా ? ఆహాహా! ఎంతయందముగ నున్నది ! సిగ్గులేని మొగమునకు నవ్వే సింగారమఁట! ఈత్యాగుఁడు- ఈ సరసము- ఏడ్చినట్లున్నది; పూర్తిగ త్యాగుబోతులలోఁ జేరినట్లైనా, యింకేమైన సంశయ మున్నదా! చచ్చినట్లు పోయి పండుకొనక యింకను నిలుచఁబడి యుంటివా! నీ రావుబహదూరుప్రయోజకము నిట్లు వెలిగిం చుచుంటివా! లజ్జావిహీనుఁడా!

గీ. మూత్రమునకన్న దుర్గంధపూరిత మయి
డాయఁగ నసహ్య మైనసారాయి ద్రావి
నడికిరేయిని శృంగార నాటకంబు
లాడుచుంటివ! నీబుద్ధి పాడుగాను.

లోభ—(భయముతో తడబడుచు) కాదు-కాదు-నా-నా మాటవిను.

ప్రియ—ఛీ! దుర్గంధపూర్ణమైన నీ నోరింక నాకడ విప్పకు. పోయి పండుకొనకుంటివా చూడు- నే నేమిచేసెదనో- నీతిబాహ్యుఁ డా! కులభ్రష్టుఁడా! తిరిగి ప్రత్యుత్తరము లిచ్చుచుంటివా ? పొమ్మిచ్చటినుండి.

లోభ—(నిష్క్రమించును )

ప్రియ—ఏమే నడిరేయి మేలుకొని నీవు చేయుచున్న దిదియా! దురా్మ ర్గురాలా! త్రాచుపాము నోడిలోఁ జేర్చినట్లు ని న్నింటఁ జేర్చ నింతంత చరిత్రములకుఁ గారణమైతివా?

చతు—అమ్మా! నాదోష మేమియును లేదు. నేను రాట్టమును ద్రిప్పు చుండఁగా—

ప్రియ—నా కందఱిచరిత్రలును దెలియును. పద నీగదికి-నా కెదురాడ కుము! (ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.



ఆలీబాబా

అను

# అదృష్టవిజయము.



## తృతీయాంకము.

ప్రథమరంగము:—రాజవీధి.

[విచారముతో నదృష్టగుప్తుఁడు ప్రవేశించును.]

(అనుబంధము. 5.)

అదృ—అకటకటా! దరిద్రమెంతవారినైన తృణప్రాయముగఁ బరిగ
ణింపఁ జేయును గదా! మానవులకు మరణదుఃఖమునకన్న
నధికమైన దీదరిద్రదుఃఖమే.

సీ. బహుకళానిధి బృహస్పతివంటివాఁడైన
బంధురమూర్ఖరూపము ధరించు
ధరణిలో నధికసౌందర్యవంతుండైనఁ
గడు ననాకారియై కానుపించు
సుజ్ఞానయుక్తుఁడౌ ప్రజ్ఞాన్వితుండైన
జడుఁడౌ నశక్తునిసరణిఁ దోఁచు
ప్రధితాసమానశూరాగ్రేసరుండైనఁ
దగనిదుర్బలునిచందము వహించు

బాంధవసమూహ మొంతేని పరిబలియున్న
క్షితిసహాయవిహీనుని గతిని దాల్చు
హీనగతు లోపంగుదరిద్ర మెంతవారి
నెంత జేయును విధిలేమి నీశ్వరాజ్ఞ.

ఇప్పటికి మూడుదినంబులనుండియు నా కాహారము లేదు ; వస్త్రములు కడు మలినంబులై యసహ్యములుగ నున్నవి. ఎప్పుడు నొకరిని దేహి యని యర్థించినవాఁడను గాను. ఏమిచేయుదును? అన్నిటి కన్న నధికమగు నీయాఁకలిబాధ నెవ్వరికిఁ జెప్పుకొందును ?

ఉ. ఆఁకలిబాధచేత సగమై; కడుజీర్ణకుచేలయుక్తశో
కాకులదేహవల్లి పరు లంటఁగ రా కసహ్యపూర్ణమై
వ్యాకులమౌ మనం బలమి భస్మమొనర్చు విషాదవహ్ని భీ
మాకృతితోఁ జెలంగ నకటా! యెటు లోర్తు దరిద్రదుఃఖముల్.

పూవులమ్మినచోట కట్టెలు నమ్మినచందమున, నీపురమున నే నెఱింగిన వారియెదుట నీదరిద్ర మనుభవించుచు జీవించుటకన్న మరణించుటయే శ్రేయము. కావున, నీపురమును వదలి మఱియొక చోటికిఁ బోవుదును. ఈశ్వరుఁడే సదా నాకు సంరక్షకుఁడు.

ఉ. ఓపరమేశ! యోవరద! యోపరమాత్మ! జగన్నియామకా!
నీపదము ల్నిరంతరము నెమ్మి భజించిన దాసుడం గదా!
నాపయి నింతతామసమునం జరియింపఁగ నేటి కయ్య! సం
తాపితభక్తలోకభయదారణ! కారణకారణా! హరీ!!

(అనుబంధము 6.)

[రామలాలు ప్రవేశించును.]

రామ—నాయనా! అదృష్టగుప్తా! నన్నెఱుగుదువా! నేను రామలాలను పేరుగల మారువాడీని. నీతండ్రికి ప్రాణమిత్రుఁడను.

అదృ—అయ్యా! నమస్కారము! నేను మిమ్మెఱుంగనా!

రామ—నీయన్న దుర్మార్గుఁడై నీ కొనరించిన యన్యాయమును వింటిని. ఇప్పుడే యాతనిం దలవామనట్లు దూషించి వచ్చితిని. నీ వాతనిపై వ్యాజ్యము వేసినచో నీకు రావలసిన సగపాలు నీకు వచ్చునే; ఇట్లేల చేసితివి!

అదృ—ఆర్యా! నేను కోర్టుకెక్క నసువ్రతముఁ గలవాఁడ నని తమ రెఱుంగరా !—

రామ—అట్లయిన నిప్పుడు నీప్రయత్న మేమి ?

అదృ—ఏమున్నది ! ఈపురమును వదలి మఱియొకచోటి కరుగ ప్రయత్నమున నున్నాఁడను.

రామ—అచ్చటి ప్రయత్నము?

అదృ—పరమేశ్వరునిదే భారము!

రామ—నీవట్టి నిరాధారప్రయత్నముం జేయవద్దు. ఈస్థలమును విడువవద్దు.

అదృ—అయ్యా ! ఎఱిగినవారి యెదుట హైన్య మనుభవించుట కష్టము గాదా!

రామ—వెఱ్ఱివాఁడా ! హైన్య మేల ననుభవింతువు ? పరదేశమున నున్నాఁడని నీ వనుకొనిన పరమేశ్వరుఁడు నీ కిచ్చుటమాత్రము లేఁడా? నామాట వినుము; నీతండ్రి నాకు ప్రాణమిత్రుఁడు; నే నీయూరు వచ్చిన ప్రారంభదినములలోన నాకపరిమితసహాయముం జేసియున్నాఁడు. కావున నాతనికి నేను ఋణగ్రస్తుఁడనై యుంటిని. ఆఋణము నిప్పుడు నీకు తీర్చుకొందును. నేను నీ కైదువందలరూప్యముల నిచ్చెదను. దీనిని నీవు పెట్టుబడిగ నీవద్ద నుంచుకొమ్ము. ఇప్పుడు మనదేశమం దంతట లబ్ధిసాహెబులు తంగేడుచెక్క రేలచెక్క వర్తకమును విరివిగా చేయుచున్నారు. వారితోడ నీకు గుత్త మాట

లాడి వ్యవహారము కట్టుదిట్టము చేసెదను. అందు నీకు విశేష ము లాభింపఁగలదు. మా యిల్లొకటి కాళిగా నున్నది. వసతి తము నీ వందుండవచ్చును.

అద్భు—అయ్యా! మీయుపకారభారము నాకు భరింపరానంత యైనది. నా కీఋణము మీ రూరక యీయనక్కఱ లేదు. క్రమముగ నేను తీర్చుకొందును.

రామ—నీకు సావకాశమున్నచో—తీర్పవచ్చును; లేకున్నను ని న్నిది బాధించునది గాదు.

అద్భు—ఇందువలన నా యన్నతో మీకు విరోధము కల్గునేమో కదా!

రామ—అతఁడు గాపుబహద్దరనియు, కౌన్సిలుమెంబరనియా నీకు భీతి? అతఁడు నన్నేమిచేయఁగలఁడు.

అద్భు—ఏమిచేయఁగలఁడు? ఏ మున్కంటాక్సునో యధికముచేయింపఁ బ్రయత్నింపవచ్చును. వీరి ప్రయోజకత్వము లింతేకదా!

సీ. మీవార్డులో రోడ్లు లేవు సత్వరముగ
వేయింతుననికదు వేఁడి వేఁడి
పైపు లింటింటిలోపల మీకు వేయింతు
నంచు నాపదమాట లాడి యాడి
గుడ్డిలాంతరు లేల కొత్త గ్యాస్ లైటుల
నెలకొల్పెద నటంచుఁ బలికి పలికి
దరఖాస్తుపై మీకు స్థలము లిప్పింపఁగాఁ
జేసెదనని నచ్చఁ జెప్పి చెప్పి
జనుల నమ్మించి వోట్లను సంగ్రహించి
పదవి లభియింప వెనుకటి బ్రదుకు మఱచి
తన విరోధికి నపకారమును దలంతు
రిపుడు కౌన్సిలర్లందు ననేకమంది.

రామ — నీవట్లు తలంచుచున్నావు గాని, ఉపకారము చేయుటకు వీ రెంత సమర్థులో యపకారము చేయుటకునయిత మంతే సమర్థులు. కుర్చీలపై నెండుగాఁ గూర్చుండి ప్రతితీర్మానమునకు గంగిరెద్దవలె తమ సమ్మతిఁ దెల్పుటే వీ రచట చేయు నుద్యోగము- ఈమాటల కేమి మానము వోదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ద్వితీయరంగము:— పాపికొండలలోని యొక ప్రదేశము.

[అదృష్టగుప్తుఁడు వేసడములతో ప్రవేశము.]

అదృ — అహాహా! ఏమి యీ పాపికొండల సౌందర్యము! ఆంధ్రదేశమున కలంకారమగు ప్రదేశము గదా యిది. పుణ్యాత్ముఁడగు రామలాలు ననుగ్రహమున రేలతంగేడుచెక్కలం గొట్టించు ప్రయత్నంబునఁ గ్రమంబుగ నీపాపికొండలకు వచ్చిన కారణమున నాకు పరమపావని యగుగోదావరీనదిని దర్శించుభాగ్యమబ్బినది.

సీ. నాసికాక్షేత్రవిభాసితగోముఖం
బలముఖమండలం బై తెలిర్ప,
దుమ్ముగూడెమ్మునందున నానకట్టయే
కంఠాభరణ మయి కాంతిమీఱ,
ధవళేశ్వరమ్మునందలి బంధనమ్ము స
త్కటిబంధసూత్రమై తనరుచుండ,
సప్తగోదావరీసలిలప్రవాహంబు
చీరకుచ్చిళ్ళను చెలువుమిగులఁ,
గూర్చునాసిక భద్రాద్రి కోటిలింగ
పుణ్యదేశంబులను తీరములను గల్గి

పతిని రత్నాకరుని జేర సతిరయమునఁ
బ్రీతి స్రవియించు గోదావరీమతల్లి.

(అనుబంధము 7)

కోయలు దూరంబున చెక్కను సిద్ధపఱచుచున్నారు. ఈవేసడంబులతోడ
వారు వచ్చునందాక నే నిందే యుండెదను.

[తెరలో నశ్వధ్వని]

అదృ—(ఆశ్చర్యముతో) ఏమిది? ఇచ్చట నశ్వరింఖానినాదము వినం
బడుచున్నది! ఒకరిదిగా వినంబడదు. పలువు రశ్వంబులపై వచ్చు
ట కేమికారణమో- రాజభటుల యలికిడి యీప్రాంతంబులం
దుండదుగదా! భయంకరం బగునీయరణ్యమున సంచరించు వీరు
చోరులై యుండరుగదా! సరే! ఎందులకైన మంచిది. ఈసమీప
మునందలి తింత్రిణీ వృక్షము నారోహించి జరుగఁగల
చర్యలం గనిపెట్టెదను.

(చింతచెట్టుపై కెక్కును.)

[మైరావణునితో 40 దొంగలు ప్రవేశింతురు]

(అనుబంధము 8)

మైరా—పరిజనులారా! మీరు లోకంబంతయు—విచ్చలవిడిగా దోచి
తెచ్చిన యనంతధనసముదాయంబులను గుహాంతరంబునం
దుంపుఁడు—జయ్ తిలోత్తమా (గుహాబ్రద్దలుకాఁగా దొంగలు
ధనమును లోపల నుంచివత్తురు.)

మైరా—సెబాస్! లెంకలారా! మీ ధైర్యసాహసంబుల కమందానం
దంబు నందితిని. మీ రేయేపట్ల నేయేవిధంబులుగ, ధనసంగ్ర
హంబు గావించితిరో వివరింపుఁడు.

1 దొంగ—సామీ! నాపలుకులినండి; మనూళ్లోవున్న పెద్దమారువోడి
యింటికెళ్ళి మొద్దునిద్దర పొయ్యేవాడిమీద మత్తుమందు జల్లి

సేతికందొచ్చిన రూపాయలు లచ్చలకు లచ్చలు తెచ్చేసినాను రేడా!

మైరా—సెబాస్! నీసాహసము మెచ్చఁదగినది; రే! రెండవదొంగా! నీసంపాదన మేమిరా?

2 దొంగ—బాబూ! నే నిలాగంటలాగంటి కన్నా లోడిసేవాణ్ణి గానండి బాబు! దొంగతనాలు కన్నాలొడవడం పిరికినాయాళ్ళు చేసేపనులండి-మత్తుమందులు-గిత్తుమందులు నాకుసుక్కెనుసు-యేళానంటే, బందిపోటెయ్యాల.

ఆ. కన్న మొడుసుకన్న గనము దోపిడిసేత
యాలికన్న సాని యమితగొప్ప
చవటకల్లుకన్న చారాయియే పెద్ద
యిభవదాభిరామ యిచనకర్రి.

అన్నాడండి మాతాతగారు.

1 దొంగ--వడిచినారు లేరా-నువ్వూ-మీతాతాను-వటి రాజాదిపోటులోనున్నాది పసందు; మొద్దునాగుండి మీదబడి పొడుత్తావు యదవనాయాలా! ఆడు నీకన్న మొద్దైతే పీనుగైపోవంట్రి.

2 దొంగ—పోడంట్రి మరి నీయంటి యదవన్నరెదవ—

మైరా—ఓరీ! మీ కీయనవసరవాగ్వివాద మేల? రెండవదొంగా! నీ బందిపోటేమో చెప్పుము.

2 దొంగ—బాబూ! వటిసెప్పను? పెద్దమెకం బాటకాడ పెనుమఱ్ఱికొటారికొమ్మెక్కి సూతునుగందా-నాసామిరంగా-నాసామిరంగా-దూరాన గనపడ్డవండి పెద్దిసెట్టి పెద్దగుఱ్ఱం--ఆటానూ ఆజీనూ-చూసేటప్పటికి మారాజా! యీడికెండేమన్న లేకపోతాదా అని దుఃబిసేసి సావుకారుని సెట్టుకిందికిరానిచ్చి-గుబాలునను కొమ్మకొమ్మ-జలజల జలనాడించి దుబుక్కున పెద్దసెట్టిమీద

మూకి పీకెట్టుకొని, నలిమేసి-క్రింద బడేసి-జేనుపు రెండువక్క-
లనున్న రూపాయల సంచులు దోచుకొని నోకటేపరు గొకటే
పరుగు బాబూ—

మైరా— భళిభళీ! చోరుండా! నీపరాక్రమము ప్రశంసనీయము. రే!
మూడవదొంగా! నీవృత్తాంత మేమి?

3 దొంగ— బాబూ! సెనోగ్గినుం-యున్న వించుకుంటారు. రాసోరింటో
రాతిరి పెళ్ళి బాబూ-నీనుగొప్పోరిబట్ట లేసుకొని-నాటకంలో
మీసాలు బెట్టుకొని పెళ్ళోరింటికి సుట్టాన్నని పేరెట్టుకొని నెళ్ళాను
బాబూ! పెళ్ళికూతురు మేనమామనన్నాను బాబూ! ఇంట్లో
మల్లెపూవంటి పక్కేశారు సామీ—సందేల పెళ్ళికూతు ర్నగ
లన్నీ సంకుగాలో పెట్టేశారు బాబు—అద్దరాతి రద్దరాతిరే
సంకుగాసంకుగా లేవదీశాను బాబూ !

మైరా— నీశక్తికి సంతసము మెచ్చినాము నాల్గవదొంగా! నీప్రతాప
మేమి?

4 దొంగ— బాబూ! మేమైనుగురమెల్లి భాగోతం గట్టామండి-ఊళ్ళో
వాళ్ళంతా భాగోతంలో వుంటే యిళ్ళన్ని వూడిచేసు కొచ్చా
మండి

మైరా— సరి-మీరును తగినవారే-మీమీ పరాక్రమములద్భుతములు
గానున్నవి. ఇంక వినవలసిన పనిలేదు. మిత్రులారా! మీరిల్లే
దినదినము నేమఱక-నప్రమత్తులై-దేశదేశంబునుందిరిగి-యపా
• రమైన ధనము నార్జింపవలెను. మీరెంతమాత్రమైన నశ్రద్ధవహింప
రాదు; దురాత్ములగు రాజభటులు మీవెనుక నున్నను లేకు
న్నను సదా యున్నటులే తలంచి-యెప్పటికప్పుడు-శత్రువులకు
దొరకకుండ పాఱిపోవుటకుం దగిన స్థితిలో నుండవలెను. ఎన్న
డును మీపై నితరుల కనుమానము గల్గించకొనవలదు. మీరు

శత్రువులకు కట్టువడ్డట్టు కనువగు నల్పచిహ్నములను వేసిని గాని వదలవలదు.

సీ. మూర్ఖుల క్షణములో మోసగింపఁగఁజాలు
 బైరాగి వేషము బ్రబడమువలయు
గుర్రిడ్డివారలలీల కుంటివారలలీలఁ
 దిరిగి రహస్యముల్ దెలియఁగవలయు
పగటి వేషములందు భాగవతములందుఁ
 గూడి లోకులను లోఁగొనఁగవలయు
తీరైన దర్వేష ఫకీరు వేషములతో
 ద్వారలయాంతిపురంబుఁ జొరఁగవలయు
మెలఁగి పురపాలకులతోడఁ జెలిమిచేసి
వారియుక్తికిఁ బ్రీతియుక్తిఁ బన్నవలయు
దొంగమాటల కన్నుల దుమ్ముఁగొట్టి
ప్రజలధనమును తస్కరింపంగవలయు.

అందఱు—చిత్తము- చిత్తము- స్వామీ- చిత్తము.

మైరా—సరే! ఇంక మనము మనపనులపైఁ బోదము రండు.

(అనుబంధము 8)

(అందఱు నిష్క్రమింతురు)

[అదృష్టగుప్తుఁడు చెట్టుపైనుండి దిగివచ్చి]

అదృ—(అటునిటుఁజూచి) భయములేదు—చోరు లతిదూర మరిగిరి. అబ్బబ్బ! చెట్టుపై నున్నంతసేపుదు నేదొంగకన్నునాపైఁ బడునో యెవ్వఁడు తనకృపాణమున నన్ను కడతేర్చున నిరజేయునో యని ప్రాణములు బిగఁబట్టుకొని యుంటినిగదా! 'ఈచోరులందఱు నెంతెంతధనమును తస్కరించి, యీగుహాతలమున భద్రపఱచు చున్నారు. ఈకవాటమును మానవులు తెఱచుటకు దుస్సాధ్య

మైనపని. ఇది భూతసంబంధ మగుగుహ కాని సామాన్య
మైనదిగాదు. ఔరా! ఎంతచిత్రము!

సీ. అల నరిందమబాబు నగచాట్లఁ బెట్టిన
చోరు పూల్నాహెటుపేరు వింటి!
నారీపిశాచియై నరహంత యగుజుమీ
లియ యనునామ మాలించినాఁడ!
చిత్రంబుగా నోట్లు సృష్టించినట్టి కా
లూరాయి యనువాని పేరు వింటి!
ఫ్రాంసుదేశపు ఘోరహింసాస్వరూపుఁ డౌ
మైకేయ రనువాని మాట వింటి!
బహుచతురు లైన రేచుక్క పగటిచుక్క
లనెడువారల చరితంబు విననివాఁడఁ
గాని, యింతటిచోరశిఖామణిని, గ
నఁగవినఁగ లేదు; మఱియు నబ్బ యగును యితఁడు.

దేశంబునం దెల్లయెడల దొంగతనములు జరుగుచున్నవనియు ననహ
వాదు లిందులకుఁ గారణమనియు దుర్వార్తలు ప్రబలిన
దీచోరులమూలముననే యని తోఁచుచున్నది. ఆచోరుఁడు
"జయ్ తిలోత్తమా" యనిపలుకుటచేతగదా యీకవాటము
:—నేను నటులే పలికిచూచెదఁ గాక! జయ్ తిలో
త్తమా!

(గుహాబ్రిద్దలయి ధనము కనఁబడును)
(అనుబంధము 9)

అహా! నాకన్నులకు భ్రమకలిగెనా? నేను స్వప్నావస్థయం దుంటినా?
జాగ్రదవస్థయం దుంటినా! ఏమియుం దోఁచుటలేదు.

గీ. రాజితము లైన నవరత్నరాసు లివ్వి,
యరయ బహుళార్బుదములు రూప్యంబు లివ్వి,
రజత హేమ భూషణసహస్రంబు లివ్వి,
ధనదునవనిధు లమరె నీతావునందె.

ఈధనమంతయుం గంటుపార్జనముగదా! ఇట్టిపరదేశంబుల నిలచుటయుం బాపమని పెద్దలు చెప్పుదురు. ఈధనము నిందే వదలి చనియెదనా! కాదు- కాదు- ఈచోరులమూలమున, సజ్జనుల కనేకుల కిప్పుడు దుష్కీర్తి రానున్నది. కావున నీధనముం గొనిపోయి పుణ్యమార్గమున వ్రయమగు నట్లొనరించి యీచోరుల గుట్టు బట్టబయలు గావించి మట్టుబెట్టవలయును. చెక్క మోసికొని పోవు మావేసడంబులు గలవుగదా! వానిపై నెరు లెఱుంగకుండ నడుగున నీసంచులు వైచి పైన చెక్కతోఁగప్పి గృహంబుఁ జేర్చెదఁ గాక.

(ధనమును సంగ్రహించుచుండ
తెర వ్రాలును.)

ఇది తృతీయాంకము.





## ఆలీబాబా

అను

# అదృష్టవిజయము.

## చతుర్థాంకము.

### ప్రథమరంగము.

లోభగుప్తు మందిరము.

[ప్రమద, లోభగుప్తుఁడు ప్రవేశింతురు.]

ప్రమ—నే నెంతబోధించినను త్రాగుడు మానరు గదా!

లోభ—అబ్బబ్బ! మరల నారంభించితివా!

ప్రమ—గృహమున నిల్లంతయు దుర్గంధముతో నిండిపోవుచుండఁగా నెట్లారంభింపకుందును. త్రాగు డారంభమైనతరువాత పలువురిలోన మీకు రవంత గౌరవమైన నున్నదేమో కనిపెట్టితిరా?

సీ. ప్రేమతోఁ బెద్ద లార్జించినద్రవ్య మ
ర్ధాంశమైనను గానరాదు నేఁడు
ప్రియవస్తువులచేతఁ బెంచిన పుష్టి దే
హంపుచందము సన్ననయ్యె నేఁడు
సాటివారలలోన పరిసన్మానంబుగఁ
దల యెత్తుధైర్యంబు దరలె నేఁడు

మంచిచెడ్డల విమర్శించంగఁ దగుబుద్ధి
సామర్థ్య మంతయు సమసి పోవు
త్రాగుటకు ధనమంతయుఁ దగులఁబెట్టి
బయట నింటను పరిహాసపాత్రు లగుచు
మిగిలినధనంబు సమిసిన మిగుల వెదచి
కడకు భిక్షాటనము సేయఁ దలఁచినారె

కొన్నినాళ్లు త్రాగినజాడయైన నా కెఱుక లేకుండఁ దాగినపూట యింటికే రాకుండ దాని కేదియో కల్లకారణ మొకటికల్పించి దినములు గడిపితిరి. క్రమముగ నింత తెగించి కొంపలోననే త్రాగు డారంభించినారేమి?

లోభ—ఇంక దొంగతనమువలన నేమి లాభమున్నది ? నీ కెట్లును తెలియనే తెలిసినది గాదా!

ప్రేమ—ఏడ్చినట్లేయున్న దిజవాబు—అదేమియమృతమా-ఔషధమా! దాసినికోత లేకుండ, నసహ్యము లేకుండ, వాసన లేకుండ, యరుచియనకుండ—నేమని త్రాగుచున్నారు! ఇంతకన్న నావు పంచితము త్రాగరాదా? పుణ్యము వచ్చునఁట !

లోభ—నీ యల్లరివలన నిషా యంతయు దిగిపోయినది. ఇఁకఁ బరుండరాదా! చాలరాత్రి యైనది గదా !

ప్రేమ—నాయల్లరి కేమిగాని, మీ రిట్లు సంపాదనలేకుండ సారాయియే మోక్షసాధనమని యెన్నినాళ్లు కొంప గుల్లచేయుచుఁ గూర్చుండఁదలంచినారు ? (అనుబంధము. 10)

లోభ—ఇకుగో! నాల్గుదినములు తాళుము; తిరిగి వర్తక మెట్లుసాగింతునో చూడుము.

ప్రేమ—ఇంకను మీకు వర్తకముచేయుటకు బుద్ధి స్వాస్థ్యమునందున్నదా?

లోభ—తుదసారి యొకవారము దినములు త్రాగి యిక త్రాగుడు మానివేయుదును.

ప్రేమ—అట్టి మనోదార్ఢ్యము మీకుఁ గలదా!

లోభ—ఏల కలుగదు?

ప్రేమ—ఐనచో నేఁటినుండియే త్రాగుడు నేల మానివేయలేరు?

లోభ—ఒక్కమాఱుగ మానివేయుట కష్టము గాదా!

ప్రేమ—అప్పుడుమాత్రము కష్టము గాదా?

లోభ—అబ్బ! నా కిప్పు డేమియుఁ దోఁచకున్నది. రేపు నీప్రశ్నలకన్నిటికిని సమాధానములు చెప్పెదనులే!

ప్రేమ—మీతమ్ముఁ డదృష్టగుప్తుఁడు మన యింటినుండి వెడలిపోయిన తరువాత నెంతయదృష్టవంతు డయ్యెనో చూచితిరా!—గోకులాష్టమినాఁడు గోవులపంచకు గతిలేనివాఁడు వట్టిరోజుననే పట్టుశాలువ తలకుఁ జుట్టినాఁడు. ఒంటిపూఁటతిండితో నొడలిసౌష్టవము తగ్గినవాఁడు కలహాసముతో కలకలలాడుచున్నాఁడు. పిల్లికి పిడుచ వేయుటకైన కొంపలో లేక బెంగటిలువాఁడు పెద్ద ధనపుమూట లభించినచందమున తాండవము లాడుచున్నాఁడు—అతనిసంగతియేదియో చూచి తద్ధనలాభరహస్యము నెఱింగి యట్లాచరింపుఁడు.

లోభ—అబ్బ! వాఁ డిప్పు డంతవాఁ డయ్యెనా?

ప్రేమ—ఎచ్చటనో యాతని కొకధనపుపాతు దొరికినదని చిన్నవదంతి గానున్నది. మీ రేవిధమో నాలుగుమంచిమాట లాడినచో నారహస్యము వెల్లడించును. మీరు తప్పక రే పాతనివద్ద కేగి యారహస్యము నెఱింగిరండు.

లోభ—తప్పక వెళ్లెదను.

ప్రేమ—నేను మరల రేపు జ్ఞప్తికి దెచ్చెదను. రండు చాల ప్రొద్దు బోయినది.

(ఇరువురు నిష్క్రమింతురు.)



ద్వి తీ య రం గ ము.

[అదృష్టగుప్తుని మందిరము.]

[అదృష్టగుప్తుఁ డొంటరిగ ప్రవేశించును.]

అదృ—ఆహా! పరమేశ్వరుని చిద్విలాస మెంత వర్ణనీయము!

సీ సర్వసర్వంసహాచక్రవర్తులు భిక్షు
మో యని గుమ్మాల మొఱలు వెట్ట
సంకరజన్ములౌ చండాలురకు పూజ్య
రాజ్యాధికారగౌరవము గల్గ
పరమపతివ్రతల్ పాపాత్ములగు దుష్ట
దనుజులకౌఁగిళ్ళఁ బెనఁగులాడ
పదివేవురకుఁ బతివ్రత లైనకులటలు
శ్రీరంగనీతులు చెప్పుచుండ
దివ్యమానులు చెఱల బాధింపఁబడఁగ
దొంగబైరాగులే జగద్గురులు గాఁగ
శానిసకు జాగసీడవై పరమపురుష!
చోద్యముగ లోక మెటు ద్రిప్పుచుంటివయ్య.

[తెరలో]

అయ్యా! తమయన్నగారు వచ్చి వేచియున్నారు.

అదృ—శీఘ్రముగ రమ్మనుము. (స్వగతము) ఏమి యీ్వావిపరీతము !

[లోభగుప్తుఁడు ప్రవేశించును.]

లోభ—తమ్ముఁడా! అదృష్టగుప్తా! క్షేమమా!

అదృ—అట్లే. నీయనుగ్రహమున నిట్లు క్షేమముగ నుంటిని.

లోభ—

ఉ. తమ్ముఁడ! యెన్నినాళ్ళకు, ముదంబున నిన్గనవయ్యెనయ్య! ఖే
దమ్ము తొలంగ బాంధవమతమ్ము చెలంగె మదీయమహా విరో
ధమ్ముఁ దలంచి చింతిల నిదం, గతచింతను వీడుమయ్య; కా
లమ్మపుడట్లు వక్రమయి లాతియొనర్చె సహోదరత్వముల్.

అదృ—సోదరా! గతజలసేతుబంధన మేల? మీరు తొలుత నిం దాసీ
నులుగండు; సావకాశముగ మాటలాడుకొందము.

లోభ—(కూరుచుండును)

(సేవకుఁడొకఁడు ఫలాహారముల తెచ్చిపెట్టును.)

లోభ—అయ్యయ్యో! ఇప్పుడే కడుపునిండ తినివచ్చితిని. ఇప్పు డివి
యన్నియు నేల?

అదృ—(నవ్వుచు) అన్నయ్యా! ఇది స్వధనసంపాదితముగాని మన
పిత్రార్జితము కాదు. నీవు నాకు దాయభాగముగా నిచ్చినది
గాదు. సంశయింపక నాయానందముకొఱకైన కొన్ని ఫలా
హారములను భుజింపక తప్పదు.

లోభ—నిన్ను చిన్నబుచ్చనేల? అటులనే కానిమ్ము (తినుచు నలువం
కలఁజూచి) తమ్ముఁడా! నీవు దాయభాగ మిచ్చినవి కావని
నన్నెత్తిపొడిచితివి. ఈ నీయైశ్వర్యము నెదుట నాసిరి యెంత?
అందు నీకు రాఁగలభాగ్య మెంత?

అదృ—అన్నయ్యా! లోకుల వెఱ్ఱియేకాని- ఎవరి యదృష్టము నెవ్వరు
మార్పఁగలరు?

గీ. మహిగతాగత నిఖిలకర్మంబులకును
ప్రజలు కర్తలమని గర్వపడుట తప్పు;

శరము చాపము క్తంబైన, శక్తియెల్ల
నవల నిలచినమనుజుని దగును గాదె?

లోభ—(తనలో) ఈతఁ డన్యాపదేశవాక్ప్రయోగం బొనరించి నన్ను నొప్పించుచున్నాఁడు. కానిమ్ము. ఇప్పు డీతనితో నయవాక్యము లాడుటయే సర్వోత్తమము!— (ప్రకాశము) తమ్ముఁడా! ఆవేళావిశేషమట్టిది. కానిచో చిన్ననాటనుండియు పెంచి పెద్దఁ జేసి నీపై నీఁగనైన వ్రాలనీయకున్న నేను, నిన్నట్లన్యాయముగ తూలనాడి గృహత్యాగిని చేయుకునా? అప్పుడుగా కెప్పుడైన నట్లుగావించి యుంటినా! అయినను పెద్దవాఁడనగు నా తప్పులు నీవు మన్నింపవలయును.

అదృ—సోదరా! ఎంతమాటనాడితిరి! మిమ్ము నేను తూలనాడుటకు మీరు గావించిన దేమున్నది? శుభముగాని యశుభముగాని మనకు మానవులు గావింపలేరని కదా నే నిప్పుడు వచించితిని.

లోభ—తమ్ముఁడా! దానిని పోనిమ్ము. కాని నీచరిత్రము నాకీనడుమ మహాద్భుతమై తోఁచుచున్నది. పాత్రయిల్లు వదలి భవనాంగణమున నివసించుచుంటివి! కట్టెలబేరము వదలి కాసులబేరము చేయుచుంటివి! ఇది నీ స్వార్జితమేనా?

అదృ—అన్నా! స్వార్జితముగాక పరార్జిత మెట్లబ్బునసుకొంటివి? నన్నే సంపన్నుఁడును దత్తమైన చేసికొనలేదే?

లోభ—వేఱుమార్గములచే పరార్జితము స్వాధీనము కాఁగూడదా?

అదృ—కాక-నేను దొంగిలించితి ననుకొంటివా?

గీ. దొంగతనము లైన దొరతనంబు లైన
కాసు గలుగువాఁడు క్రిమ్ముకొనును;
నిధి, యదృష్టమునను నిఱుపేదవానికి
దొౘికినంత వాని దొంగ యందు?.

లోభ—అటులైన నీకేదైన పెన్నిధి దొరికెనా యేమి ?

అదృ—దొరికినమాత్రమేమి?—దరిద్రుఁడ నగు నాపట్ల నది దొంగతనమే యగుఁగదా!-చిక్కు లేక పోవుటకు శ్రీమంతుఁడను కాను గదా!

లోభ—దానికేమి?- ప్రజలు న్యాయార్జితము లనుకొనుచున్న వేవి దొంగతనములు కావో చెప్పుము—

సీ. క్షాత్రంబుపేర రాజ్యము లాక్రమించిన
ధాత్రీశులది దొంగతనము గాదె!
మంత్రాల నరచేత వైకుంఠమును జూపు
నవనీసురులది చౌర్యంబు గాదె!
వర్తకులనఁగఁ బ్రవర్తించువారి స
ద్ధనసంగ్రహంబు దొంగతనము గాదె!
ప్లీడర్ల మని డబ్బు కూడ బెట్టినవారి
ఘనతయంతయు దొంగతనము గాదె!

చౌర్యరహితమౌవృత్తి యీజగతి లేదు
దొంగతనమె లౌక్యంపుమూలాంగ మగును;
అవని యాశాపరిపూర్ణ మీయాశయాను,
గర్భితములు చౌర్యాసత్యకల్పనములు.

కావున నిందలకు మనము చింతింపవలసిన పనిలేదు.

అదృ—అన్నయ్యా! అల్పులెవ్వరికి వా రనుకొనుట సహజమే గాని, యొకరిలోపంబుల నెన్నుటయందు లోకు లసమానపాండితీ మండితులు కావున వెఱువవలసివచ్చినది.

సీ. సాంధ్యకాలమున విశ్వాస్తారతుఁడు పవల్
కాంతలపై తిట్టుకవిత లల్లు

అసహాయువాఁడై యార్భాట మొనరించు
వాఁడు శేలను కల్లుపాక దూఱు
ధర్మపీఠమున జూదరుల శిక్షించిన
వాఁడు మేజిడిపేక లాడుచుండు
సత్యబోధను పాఠశాలలం దొనరించు
నొజ్జ లనృతం బాడు నువిదతోడ
గీ. రంగమున ధర్మరాజపాత్రంబు దాల్చి
కాలిచెప్పులకొఱకు నాగ్రహము దాల్చు
సర్వధర్మాచరణపూర్వనిర్వహుండు
జనులలో నుండఁబోవఁ డీశ్వరుఁడు దక్క.

లోభ—కావున నీధనము నీకెట్లు లభించిన నరే—పరమేశ్వరదత్తమగుదానిని నీ వనుభవించితివి కావున దోషము లేదు. నా కొకింత తద్వృత్తాంతము నెఱిఁగింతువేని విని యూరకానందించెదను.

అదృ—అన్నయ్యా! ఎట్లు వచ్చిన నేమి? దొంగతనమో దొరతనమో—నీతమ్మునియభ్యుదయము గదా నీవు కోరునది?—చాలును. ఇంతటితో నాపరిశంస కట్టిపెట్టుము. సోదరా! చతురక్షేమమే గదా!—

లోభ—(తనలో) వీఁ డొందును లోఁబడకయున్నాఁడు. చతురయాశఁ జూపి యీరహస్యమును వెడలఁగ్రక్కించెదఁగాక! (ప్రకాశముగా) తమ్ముఁడా! చెప్పమఱచితిని. చతుర నీకొఱ కెంతయో బెంగగొనియున్నది. నాపై నీకు కొంచె మాగ్రహ మున్నను—ఆబాలిక నీప్రేమము నందఁదగినది గదా! దానికొఱకైన మాయింటి కొకమారు రాఁగూడదా?

అదృ—అన్నా! వెనుక నీవు నన్ను తన్నిన పదతాడన మింకను స్మృతి

రయం దున్నది. నేను మఱతుననుకొంటివా ? అయినను "పితృ
సమోజ్యేష్ఠ" యను శ్రుతి ననుసరింపవలయును గదా! నీవు
వలచినకాంతను వలచితి నేని నాకన్నులు పోవును గదా!

లోభ—తమ్ముఁడా! గతకృత్యము లన్నియు స్వప్నప్రాయములుగ
మఱువవలయు నని నిన్నుఁ బ్రార్థించియుంటినే! తిరిగి వాని నేల
మరల మరల వచించి నన్ను వంచింపఁ దలపోసెదవు? నీమన
సింతకఠినమా? ఆచతుర పెద్దవాఁడ నగునాతోడ నేమి సుఖం
పఁగలదు? అది యెన్నటికైన నీధనమే కాని నాది గాదు. ఆ
నాఁడు దుర్విధివరిపాకమున నీతోడ నే నెట్లు కలహించితినో,
అట్లే—చతురయందు నీకుఁగల ప్రణయమునుసయితఁ మాటుంక
పఱచితిని గాని వేఱుకాదు. దినము లొక్కతీరుగ నుండునవి
కావు. మనస్సు లొక్కభావమునందు నిలుకడఁ గాంచునవిగావు.
ఆదినములు పోయినవి. వానితోపాటు నీదరిద్రదేవతయు నా
యిల్లు వదలిపోయినప్పుడే వదలిపోయినది. ఇప్పుడు నీసోద
రుని దయఁజూడుము. నాయింటికి రమ్ము. చతురతో నానంద
ముగ మాటలాడుము. నీ కభ్యంతరమేమి? నాయిల్లు నీదికాదా!
నా ధనము నీదికాదా! ఏకగర్భజనితుల మైన మనలో మనకు
భేద మేమున్నది ?

చ. అనుజుఁడనైన నాపయిన నాగ్రహ మూనకుమయ్య, నాపయిం
గసికర మింత మానినను; కంజదళాయత చారులోచనన్
ఘనకుచయుగ్మ నాచతురఁ గాంచుటకైనను మద్గృహాంతరం
బున కరుదెంచుమయ్య; మన ముందటివైరము విస్మరింపఁగన్.

అదృ—(తనలో) ఎంతయైన నీతఁడు సోదరుఁడుగదా! అదిగాక గర్వ
భావవర్జితుఁడై నాతోడ నతిదీనంబుగ భాషింపుచున్నవాఁడు.
ఏకారణముననో యొకింత పొరపుగల్గినమాత్రమున సన్నిహిత

రక్తబంధువులం గాదనవచ్చునా? తెగినదాకం దెంపుటకర్తవ్యము గాదు. అదిగాక నీతనితో నీసమయమున విరోధపడితినా— యింక చతుర నా కెన్నటికి లభింపదు. కావున నీతని కోరికం దీర్చుటయే మంచిది. (ప్రకాశముగా) బంధువాత్సల్య పరిపూర్ణ మహోదరా ! సహోదరా !

గీ. తండ్రివైనను నీవె; సోదరుఁడవైన
నీవె కా కన్యబాంధవు లేరి నాకు ?
ఇంతలోన క్షమాపణ మేలనయ్య,
నేను నీదాసుఁడను గాన మాననీయ !

లోభ—సోదరా! నీబంధువాత్సల్యమును నే నెఱుంగనా! నన్నొక్క-మారు కౌఁగలించుకొని నాయలమటం దీర్చుము.

అదృ—(కౌఁగలించుకొనును.)

లోభ—అదృష్టగుప్తా! ఇప్పుడుగదా నాసోదరుఁడ వైతివి? నే నేల నీయైశ్వర్యాగమనకారణముం బ్రశ్నించితో యిప్పుడు వినుము.

గీ. సత్వరము లభించిన నీదు సంపదలకు
సంశయించుచు నుండిరి జనులు నిన్ను
దుష్టజననిందలకుచోటు దొలఁగ, నే యు
పాయమును రాక గాపాడవలదె చెపుమ !

[తెరలో]

బాబూ! అన్నగారికిని, తమకును భోజనము సిద్ధమయినది.

అదృ—అన్నా! సాధనలాభవృత్తాంతమంతయుఁ దమకు భోజనసమయమున నెఱింగించెదను రండు.

లోభ—అట్లే కానిమ్ము. (ఇరువురు నిష్క్రమింతురు)

3 వ రంగము.

[కరటకుఁడు దమనకుఁడు ప్రవేశము.]

కర—దమనకా! వంగలేనివాడు దొంగలలో గలసినన్నట్లు—పనిపాటలుచేతగాక బందిపోటుతన మారంభించితివటరా! నీతాడు తెగ-నిన్న బీడీముక్కకు గతిలేనివాడ వీదినమున బిళ్ళకుడుముల వంటి పదిరూపాయలను దెచ్చితివి!—మన యదృష్టగుప్తని యైశ్వర్యదేవత నిన్నేమైన పూనినదా యేమి?—

దమ—అదృష్టదేవత యేమో కాని—అమ్మవారుమాత్రము పూనినదిరా.

కర—అదియేమి ?—

దమ—నిన్న రాత్రి నిద్రపట్టక తిన్నగా బయలుదేరి పాములపుట్టవీధిని సోమాలమ్మ గుడివద్ద జాతరజరుగుచుండగా చూతమని వెళ్ళితిని. ఇదివఱకు నాకు కొంచెము ఏదోసంబంధ మున్నదొకతె శివముపట్టి వేపసుండలు చేతబట్టుకొని యూగుచున్నది.

కర—అబ్బా! నిజముగా దానికి శివము పూనినదటరా !

దమ—అబ్బే !-శివమూ లేదు—శివమూ లేదు. నన్ను జనములోనుంచి యెప్పుడు చూచినదో మెల్లగా కన్నుగిలిపి—అట్టె-అట్టె-అనుచు నాదగ్గఱకువచ్చి, వేపనారతో కట్టి పసపు రాచిన త్రాడు దీసికొని ఛెళ్ళున నావీపుపై నొక్కటి తగులనిచ్చినది ఆదెబ్బతో నా కొడలు తెలియకుండ విఱుచుకొని పడుచుండగా నా కమ్మవారుపూనిన దని భ్రమపడికాబోలును పదిమంది నన్ను బట్టుకొని వీరణములు, డప్పులు, చెప్పలు చిల్లులుపడ ఢమ ఢమ ఢమ ఢమ వాయించిరి. నాకు తెలివి వచ్చిరాకముందే యింకొకడు బుడ్డెడుసారా తెచ్చి నా నోటబోసెను. దానితో నాకును అమ్మవా రావేశమై పోయినది. అప్పుడు నావలపు

గత్తె వచ్చి నాభుజములపై చేయివైచి యథేచ్ఛగా నాట్య
మాడసాగినది. అబ్బబ్బ !-ఆసౌఖ్య మేమిసౌఖ్య మనుకొన్నావు?-
మా కూరిపోడుగువా ఘుగ్గిలాలపాగలే ! ఎక్కడజూదిన
స్నానలే ! ఎవరినిజూచిన కానుకలిచ్చేవారే ! ఆనందమున దాని
మెడలోనున్న పుస్తెలబొందును నేను తెంపుకొన్నది కూడ నది
చూడలేదు. అదిగో ఆ బాపతు రూపాయిలివి !—

కర—సెబాస్ రా ! దమనకా ! మంచిపని చేసితివి.

దమ—సరే కాని- నీవదాటున నన్నమాట నా కుపదేశప్రాయముగా
నున్నది సుమా !

కర—ఏమాట ?

దమ—వంగలేనివాడు దొంగలలో కలసె నన్నమాటయే ! ఈలోభ
గుప్తునిదగ్గర పాడుకొలువు మన కెన్నాళ్ళురా! జీతమైనను సరిగా
నిచ్చినపాపమున బోదు- సరిగదా, తిట్లు, కొట్లు తప్పుటలేదు.

కర—అట్లయిన నిప్పు, డేదొంగలలో కలియ దలచితివి ?

దమ—ఈచుట్టుప్రక్కల నేదో దొంగలగుంపు తిరుగుచున్న దని
కొంచెముగా నాకు తెలిసినది. అందు చేరినచో నా కేమైన
లాభింపగలదేమో యని యున్నది. పిల్లా మేక లేనేలేరు- సరే
కదా, కల్లునీళ్ళకైనా కానిడబ్బు లేని గతియేమిరా ?—

కర—ఐనను, నీవంత తొందరపడకు. అమ్మగారు నాతో నొకమాట
నేడు పొరబాటున నోరుజారినది.

దమ—మనకు లాభించునదేనా ?

కర—జరిగినచో లాభించునేమో యనియే తోచుచున్నది. ఐనను
నా కావృత్తాంతమేమో పూర్ణముగా తెలియలేదు. ఎక్కడ
నో సంచులకొలది నేడు ధనము దొరకుననియు, దానికొఱకు
బాబుగారు వెళ్ళెదరనియు ప్రమాద చెప్పినది.

దమ—ఐన మన కేమిలాభము! ఇదివఱ కీతడు సంచులకొలదిగ గణింప లేదా—గణించిన మనకొయిడిలో పడెనా!-

కర—అది కాదు. ఇది గణింపకుండ వచ్చునది మనకు బహుమాన ములు దొరుకును.

దమ—వచ్చియు మేధ్యమును కుడు పరమ భండాలుడురా!-

ప్రమద—(ప్రవేశించి) కరటక దమనకులారా!! ఇంక నిచ్చట నేమి చేయుచుంటిరి? ఇంటిలో నెంతపని యున్నది!

దమ—ఏమిచేయుమమ్మా! కానిలేక కడుపు కాలుచున్నది. క్రిందట మూడు నెలలజీత మీరు లేదని ఒకరితో నొకరము చెప్పుకొని ఏడ్చుచున్నాము.

ప్రమ—దమనకా! విచారింపకుము. నేడే మీకు బహుమానములు కూడ దొరుకును.

దమ—ఎప్పుడు?-చచ్చిన తరువాత?

ప్రమ—ఆ!—ఎవరు చచ్చిన తరువాతరా! తులువా!—

దమ—మే మాకలిచే చచ్చినతరువాత నా యని యనుచున్నానమ్మా! ఒకరినేల యందును? బాబుగారి నామాట యనిన నాజుట్టు పీకక యూరకుండునని మొఱుగనటమ్మా!

కర—ఛీ! ఛీ! అసందర్భపుమాట లాడెదవేమి? రా! రా!

(నిష్క్రమింతురు)

ప్రమ—ఆహా! అదృష్టగుప్తుని ధనరహస్యము నెఱింగి నానాథుని సైతము మాగుమాకడకు కట్టెలను గాడిదెల నిచ్చి పంపఁగా నీతులువదమనకుఁ డిట్లు విరసోక్తు లాడెనేమి? ఊ- వీనికి విచార మేల? ఆహా! ఇఁక నే నెంతో భాగ్యశాలిని గావచ్చునుకదా! అదృష్టగుప్తుని కొంతకును, ఆదొంగలకొంతకును దమ్మిడీ కాసు మిగులనిత్తునా!

(నిష్క్రమించును.)

4 వ రంగము:—మైరావణుని గుహ.

మైరా—
(అనుబంధము 8)

పరివారములారా! నేఁడు మన కత్యంతప్రియకరమగు నమావాస్య. దురాత్ముఁడగు సూర్యుఁడు పశ్చిమశైలంబునఁ గ్రుంకుచున్నవాఁడు. మనలఁ గన్నతల్లివలె గాఢాంధకారము దిశాముఖములందు సాంద్రముగ గ్రమ్ముకొనుచున్నది. మన పంచకల్యాణుల్లవే మొదలు నిక్కించి ప్రయాణంబుల కాయత్తంబులగుచున్నవి. హెచ్చరిక! హెచ్చరిక! కాళీమాత కరుణారసము మనపైఁ బ్రవహించుచుండ భీతి రవంతైన లేక నప్రమత్తులై కార్యంబుదెసవారలు గావలయును. మీ కరవాలంబులు సమయమొదవిన మానవరక్తపానంబున కుమ్మక్తంబులై యుండునుగదా! మీ స్వేచ్ఛావిహారంబుల కీరాత్రియే పరమావధి. ఈ రేయి మీ సంచారంబుల నాటంకపఱచిన దుండగీంద్ర నెవ్వరినైన సరియే ప్రాణంబులతో నుండనీయకుఁడు. మీ శత్రువులకొఱకు కాలయముండే తన యమపురకవాటంబులను స్వేచ్ఛగాఁ దెఱచియుంచినాఁడు. ఈ యమప్రతినిధి యపర మైరావణుఁ డీమైరావణుఁడు మీ కాజ్ఞ యిచ్చుచున్నవాఁడు.

సీ. పదనుకత్తులతోడ నెదురైన పగతుర
నభయతఁ జీల్చి చెండాడవలయు
బాటసారులపైన బడి కాలు సేతులఁ
గట్టి కన్నుల దుమ్ము గొట్టవలయు
పౌరుషంబును జంపు పాపభీతిని దోలి
కడుసాహసం బెదఁ గాంచవలయు
తనరు రాత్రించరత్వంబు సార్థకముగా
భయదస్వరూపులై ప్రబలవలయు

ఎవడు మన కీడు జగములఁ నెంచ దటంచు
కాలునబ్బకైనను బొమ్మ గట్టవలయు
రుధిరమే పానకంబుగఁ గ్రోలవలయు
నిలను మైరావణుని పేరు నిలుపవలయు

దొంగలు—జయ్- కాళీమాతకు జయ్.

మైరా—పరివారములారా! ఇదే మీకరవాలంబులను పైకెత్తి కాళీమాత నొక్కమారు స్తోత్రము జేసి బయలుదేఱుఁడు. మహిషాసురమారణపరితాపశాలిసియు, ప్రచండభైరవస్వరూపిణియు, రుధిరాస్వాదనప్రమత్తయు నగు కాత్యాయనీదేవియే మనకార్యంబులకు మార్గదర్శిని. ఏదీ!- కంఠము లెత్తి మరియొకమారు కాళీస్తోత్రము చేయుఁడు.

అంద—జయ్- కాళీమాతకు జయ్.

(అనుబంధము 8)

(అందఱు నిష్క్రమింతురు)

[లోభగుప్తుఁడు ప్రవేశము.]

లోభ—ఆహా! ప్రమాదమునుండి భగవదనుగ్రహమున బయలువడితిని. ఆచోరులు తమ యశ్వంబుల నెక్కి యాదారిగా నరిగిరి. నేను వీరి దృష్టిపథంబునం బడియుండిన నన్నీవఱకే రెండు తునుకలు జేసియుందురు. ఔరా! వీరిమొగంబుల నింతైన శాంతరసము బొడకట్టదే! పెద్దపులిగుహయందుఁ జిక్కిన మేకచందంబున నే నీగుహఁ జేరి నిష్కారణమరణంబుపాలు గావలసివచ్చునేమో!—ఆ! అటులేల జరుగును. ధనము లభించిన యంతనే మరలిపత్తునుగదా! ఆ! మఱచితి—వాతమ్ముఁడు వచించిన దదేమిమాట?-బలోత్తమా!-కాదుకాదు. చలోత్తమా! అదియునుగాదు. ఖలోత్తమా!-కాదు- ఆ-స్మృతికి వచ్చినది.

తిలోత్తమ "జయ్ తిలోత్తమ" యని పల్కుటతోడనే యీ కవాటంబులు విడిపోవుననిగదా వాతమ్ముఁడు చెప్పెను. నేనటు తేలచేయకూడదు. (దగ్గరకేగి) ఓహో! చలోత్త-కాదు-కాదు- జయ్ తిలోత్తమా!

(గుహ తెఱువఁబడును.)

లోభ—భళి! భళీ! తమ్ముఁడా! తమ్ముఁడా! అదృష్టగుప్తా! నీకు చిరాయుష్యము గలుగుఁగాక! నీనోట నమృతము వర్షించుఁగాక! ఓపెట్టిలోభగుప్తా! పరమాత్ముఁడు నీకీమహాధనరాసుల జూపఁగా—నిచ్చట నింక మొద్దువలె నిలువబడియుంటివేమి? వహ్వా! వహ్వా! చతురా! నీపంట పండినదే! ఇంక నీవిప్పుడు నన్నేల వరింపవో చూచెద. ధనలక్ష్మికి నాపై నెంతయనుగ్రహము గల్గినది. ఓహో! నేనిదియంతయు ననుభవించుట కీశ్వరుఁడు చిరాయుష్య మిచ్చెనో-లేదో- నాకిది ఒకవేళ కలకాదుగదా! (చేయి కఱచుకొని) కాదుకాదు. ఇది నిక్కువమే! కలగాదు. హాయి. హాయి. నాకన్ను లింతధనము నెప్పుడైనఁ జూచెనా? ధనము-ధనము- ధనమే ప్రాణము. ప్రాణము పోయినఁ బోవుగాక! ధనము పోవచ్చునా?

(లోపలకుఁ బోవును. తలుపు మూయఁబడును)

[దొంగలతో మైరావణుఁడు ప్రవేశము.]

(అనుబంధము 8)

మైరా—(గాడిదలను జూచి) రే! ఏమందభాగ్యుఁడు నాకఱుకత్తికి బలిగాఁదలంచి నాగుహచెంగట నడుగుపెట్టినాఁడు. హుం- ఎవడు భయములేక- పెద్దపులి మీసములతో నుయ్యాలలూఁగ నెంచినవాఁడు- బుసలుకొట్టు పాముల నాలుకలచెంతఁజేరి యే యదృష్టహీనుఁడు తద్గరళాగ్నిజ్వాలలయందు భస్మీభూతము గాఁదలంచినవాఁడు?

1 దొంగ—మహాప్రభూ! ఏమిది? జగమంతయు గు మీపరివారము లుం
డఁగా- మీకాగ్రహంబు గల్పించిన పాపాత్ములెవ్వరు?

2 దొంగ—మైరావణసార్వభౌమా! ఇంతదనుక నానందముతో
నుంటిరే! ఇప్పుడు మీహృదయంబున నీనూతనోత్పాతంబు
నుద్భవింపఁజేసిన ఘోరకార్య మేమి? తత్కార్యంబునకు హేతు
భూతుఁడగు పాతకుని బరిమార్చి వానిశిరంబును మీపాదముల
నుంతుము.

మైరా—ఛీ! ఛీ! దివాంధములారా! కన్నులు మూసికొనియుంటిరా?
శరీరములు మఱచి యుంటిరా?-బుద్ధిలేని మిమ్మెవ్వఁడో టక్కరి
మోసపుచ్చి- యీప్రాంతంబులఁ దిరుగుచు మనగుట్టు వెలి
బెట్టఁదలంచిన మఱికిపత్తుల నెఱుఁగక నన్ను ప్రశ్నింపుచుంటిరా!
మందబుద్ధులైన మిమ్మేమిచేసినను బాపములేదు. ఆవేసషంబు
లు మీకన్నుల కగుపడలేదా?- గుహాముఖమువఱకు గనపడు
చున్న యాక్రొత్తయడుగుల జాడ క్రొత్తవారివని తెలిసికొన
లేకుంటిరా!-ఆపాపి యెవ్వఁడో గుర్తించి కనిపెట్టి నాకడ కుంప
రేని మీప్రాణంబులను బాయువారని యెఱుంగుఁడు.

(అనుబంధము 11)

మైరా—చాలు చాలును-తొలుత మీరుదెచ్చినవెల్ల గుహాంతరమున
డించిరంఖ- పదపడి కర్తవ్య మాలోచింతము. "జయ్ తిలో
త్తమ"

అంద—(గుహ తెరువబడగా లోపలికరిగి లోభగుప్తుని పట్టితెత్తురు)

(అనుబంధము 12)

మైరా—రే! కపటక్రియాచరణా! ఎవ్వఁడవునీవు? నిర్భయముగా
నింటఁజొచ్చుటకు నీకెంతసాహసము. ఇది జగత్ప్రసిద్ధుఁడగు

మైరావణుని గుహాయని యెఱుంగవటరా ? టక్కరీ ! మిక్కిలి యగు ధనంబు దక్కునని భీతిలేక—ప్రాణంబులపై వాశలేక-నీకార్చిచ్చు నరచేతఁ బట్టుకొంటివేమి? నీపేగులుత్రోడి రాలు గొట్టెదను. నీనోరు పెకలించి నారసంబుల గుచ్చెద-నీవెచ్చని నెత్తురుతో కాళీమాత నభిషేకించెద—గడగడవణకుచు మొఱ దువలె నిలిచెదవేమి ? మాగుట్టు వెలిబెట్టి బట్టబయలుజేయ ననుకట్టిన కట్టడివైన నిన్ను బట్టి పాలార్చెద. నీశరీరంబును రెండు చీలికలుజేసి యీగుహకు తోరణముగ గట్టెద- ఎవ్వఁడవునీవు ?

లోభ—(భయముతో) మమమమ మహా-ప్రభూ ! రరరరరక్షింప వలెను.

మైరా—రే ! చెనటీ ! పిఱికిపందా ! (కాలితోఁదన్ని) ఎవఁడవునీవు? నీకు మాయిక్కవ మెఱింగించిన చండాలుఁడెవఁడు? మీరింక నొండఱుగలరు? వడవడ వణకెద వేమి? చెప్పెదవా—చంప వలయునా? ఇదిగో కరవాలము!

లోభ—(భయముతో) రరరరరరరక్షింపుము—రరరరరరరక్షింపుము.

మైరా—(కాలితోఁదన్ని) ఛీ!-వీనినోట మాటయే వెలువడుటలేదు. భీతిచే వీనిప్రాణము లిదివఱకే సగముపోయినవి. ఐనను వీనిని వదలిన నపాయముగలదు చోరులారా ! వీనిని నిలువున కత్తితో రెండుతునకలుగా ఖండించివేసి మన మర్గమునర్గంబున వ్రేలాడదీయుఁడు. కాపుకావుమని మూకలుగట్టి కాకులు వీని మాంసమును బొడుచుకొని రక్తంబుపీల్చి సుఖించునుగాక !

(అందఱునుకలసి లోభగుప్తుని చంపుదురు)

(తెర వ్రాలును.)

ఇది చతుర్థాంకము.



## ఆలీబాబా

అను

# అదృష్టవిజయము.

## పంచమాంకము.

[కరటకుండు సారాబుడ్డితో ప్రవేశము.]

కర—దీని తల్లిసిగదరగ! ఈతకల్లంటే యీతకల్లుగాదురా నాసామి రంగా! దొర్లు- మా రాజులు- గొప్పోరు- సముబుకున్నోరు- గరాణాగోరు- విస్కికెట్లంటా- యిసికీలంట- పెద్దపెద్దోళ్లంట- యేటేటో తాగుతారుగాని- మా రాజా- ఈతకల్లుమజా దేనికీలేను. సాకబారైనా- మైకమెత్తించి యిసిరిసిరి కొట్టేసింది; కిందేడు లోకాలు మీదేడులోకాలు రప్పన యిసిరికోపులాగ గాలిలో ఆడిపోయినాయి—దొర్లు భూమి తిరుగుతూందని తాగినప్పుడు కనిపెట్టేశారు బాబూ! ఆడికి భూమొక్కటే తిరిగిందిగాని యీతకల్లు పట్టుమీద నా కిల్లూ-వాకిలీ-కలిగిన్నంతా గిర గిర గిర గిర గిర తిరిగిపోతూంది నాసామీ!..........బాబూ- తాగుతానని నవ్వాకండి తాగనోళ్లెవళ్ళు లేరూ—

పాట. ధన్యాసి—ఆది.

తాగని వాడెవ్వడురా యెరుకా!<br>
తాగుడు దోషంబేమిటిరా॥ తా॥

తెల్లవారగనె నల్లమందు లేకున్న వాడిపోలికను ।
చల్లగ హోటలులోనదూరి నవనాగరికముగా కాఫీనీళ్ళను॥ త్రా॥
కేటుపావలా యయినను దానిని పాటింపక మదిలోన ।
నీటుగకిళ్లీ బిగించి యీపయి మేటిసిజరుసిగరెట్టు ముక్కను॥ త్రా॥
ఫోర్సులేదనుచు సణుగుచు గొణుగుచు గ్లాసులోన పోయించి।
అందులోననై సురుపైయుంచి-యందమైనసోడా లిమినేడులు॥ త్రా॥
త్రాగుటకేదియు దొరకనప్పుడును త్రాగుడుసురచేదెవ్వడురా ।
వేగంబుగ దాహంబయినప్పుడు బాగుగ చెంబెడు మంచినీళ్ల
యిన॥ త్రా॥

[ప్రమద ప్రవేశము.]

ప్రమ—ప్రాణేశ్వరుఁ డరిగి యేఁడుదినములైనది మరలి రాని కారణము తెలియదయ్యో; నోటనన్న నమంగళముగాని- యాచోరుల గుహయందు నేయశోకవిధముగా జరిగిన నేమిగతి? చీ! చీ! నేనెంత మాట తలంచితిని? లెక్కలేని ధనసంచయంబులం దెచ్చుచు దొంగసొమ్మగుటచేత, నింటికిఁదెచ్చుటకు భయపడుచు మఱొక్కచో దాయఁ బ్రయత్నించుచుండెనో-కాక నందులభించిన మణిసంచయంబులను మార్చి ధనముగా నొనర్పఁ దిరుగుచుండెనో! ఏదియెటులైననీవిషయమున మెలకువగనుండుటయే మంచిది. ఏమోకాని యెంతసరిపుచ్చుకొందమనుకొన్నను నాచిత్తము కీడునే శంకించుచున్నది. కరటకుఁడేఁడి? కరటకా! కరటకా!!

కర—(తూగుచు) ఏటిబాబూ! తాగితే-నే నా ళ్ళీళ్లడబ్బెట్టితాగేనా! ఏలంజకొడుకు నాకిచ్చాడేంటి?

ప్రమ—(తనలో) ఈనీచుఁడు తలమున్కలగునట్లు త్రాగియున్నవాఁడు నోరువిప్పిన పాడుకంపు గొట్టుచున్నది! (ప్రకాశముగా) ఓరీ! కరటకా! కరటకా!

కర—(తూగుచు) ఎవళ్ళురా? నాకు సిరొత్తిపోయింపంటే నూసు
కొండ్రామరి!

ప్రమ—(కాలితోఁదన్ని) ఛీ! దురాత్మా! కన్నులు విప్పిచూడు.

కర—(భయముతో) బాబూ-బాబూ- తాగలేదు బాబు- వొల్లమా
లినోళ్ళబద్దాలాడే కాదు- నామీద.

ప్రమ—ఛీ! త్రాగుడుమాటను మానివేయుము. నీయజమాని యేడీ?

కర—ఇసికీతాగి ఇంగిలీషుకళ్ళులో తూగుతున్నాడేమో—

ప్రమ—ఛీ! తుంబవా! అసందర్భప్రలాపము లాడకుము.

కర—(తనలో గొణుగుకొనుచు) అసందర్భమేంటి బాబూ- బాబుగారు
చుక్కేసుకోట మబద్దమేంటి? నేనుగాదా బాబూ బట్ట సాటు
నెట్టుకోని బుడ్లకు బుడ్లు తెచ్చేసేవోణ్ణి—

ప్రమ—ఛీ! నిన్నుచూచిన నాయొడలు మండుచున్నది. ఇక్కడినుండి
నీవు శీఘ్రముగ నావలకుఁబొమ్ము.

కర—అంటే కానా బాబూ- తాగినోడితో మనకేంమాటలు.

(నిష్క్రమించును.)

ప్రమ—ఆహాహా! ధర్మప్రాణనాథదేహాభావవ్యాకులము ప్రాణానిలం
బులంబట్టి పాలార్చుచున్నది. కల్లోలసాగరంబువలె మనంబు
క్షోభించుచున్నది. నాథునకేమియో కీడు మూడినదనియే నా
నిశ్చయము! ఏమిచేయుదును? ఎవ్వారి నేమందును?

[చతుర ప్రవేశము.]

చతు—అమ్మా! మీరు చెప్పినప్రకారము పూలమాలలు కట్టితిని;
గంధముతీసి సిద్ధముచేసితిని.

ప్రమ—ఓసీ! పాపాత్మురాలా! నానాథుం డీదినమున ధనముతోవచ్చు
నని సంబరపడి -పూలమాలలుగట్టి- గంధము తీయవలసినదని
చెప్పితిని. ఎంతయేడ్చుచు పూవులుగ్రుచ్చితివో-నీయుసురు తగిలి

నాధుడు రానేలేదు. నీదృష్టి తగిలిన పచ్చనిచెట్టయినను భగ్గున మండిపోవనుండఁగా - మనుష్యుల లెక్కయేమి? మహామారివి-మాయింటజేరితివి!—అదృష్టగుప్తుంతోనైన లేచిపోవయితి వేమే రాకాసీ!

చతు—నేనేమిచేసితినని నన్ను నీవిట్లు నిందించుచుంటివి? ఎన్ని తిట్టినను ఎన్నికొట్టినను సాధుస్వభావను కావున నీచెప్పుచేతలలో నున్నందులకా నా కీమాటలు- పోటులు- తప్పకుండునట? ఇంకెన్నాళ్ళు నేను సహింపఁగలను?

ప్రమ—సహింపలేక చేయగలిగినదేమి? నిన్ను చిన్నతనమునుండి పెంచిన దెందుల కనుకొంటివి?

చతు—నావలన చాకిరి చేయించుకొనుటకు—నాసపర్యలందుటకు—అంతేకాని, కొట్టుటకు తిట్టుటకా?

ప్రమ—నిన్నుకొట్టవలెనా—కోయవలెనా! ఏమిచేసిన పాపమున్నది?

చతు—నేను చేసినపాపముమాత్రమేమున్నది!

ప్రమ—ఆఁ! పాపమే లేదా! నాచెప్పుచేతలలోనుండి, నాగీచినగీత దాఁటక, నాయడుగులకు మడుగులొత్తుచుండిన నాపతిని పాడుజేసి నామాట వినకుండ జేసినది నీవుకాదా! నామొగముకొంచెము చాటయిన చాలునని గుసగుస లాడుచున్నది నీవుకాదా! ప్రాణేశ్వరుఁడు నేను చెప్పుకొనుటకునైనను చిన్నతనమగునట్లు నాకు లజ్జగలిగించినది నీవుగాదా! ఛీ-దుర్మతీ! ఏమిచేసితినని నంగనాచివలె పలికెదవేమి?

చతు—శ్రీరామ రామ—నేనాయన నెన్నడైన నోరెత్తి పిలిచితినా? తల్లీ! యింత యన్యాయము నీకు తగదుసుమా!

ప్రమ—ఏమీ! అన్యాయమంటే జానిసా! (కొట్టుచున్నది)

(అనుబంధము 13)

చతు—ఆహాహా! ఇప్పు డెవ్వరితో మొఱపెట్టుకొందును? నా కెవ్వరు తోడునీడ ఎవ్వరు? ఓజగదీశ్వరా! విశ్వమంతయు నిండియుంటి వని ప్రతీతిగల నీ వెచ్చటనున్నావు? ఉన్నచో నా మొఱ నీ వేల నాలింపకున్నావు? ఆలించిన నేల పాలింపవు? పాలించిన పాప మని తలంచితివా? సర్వభూతసముండవని చెప్పుదురే! నీసమ వర్తిత్వ మిప్పు డెందు దాగినది? ఓదయాగంధీ! బానిసతనమును మాయించి, యానందరాజ్యమును సంస్థాపింపఁ గంకణమును గట్టుకొంటివిగాదా? నీవిప్పు డేకారాగృహముల బంధింపఁబడి యుంటివి? ఓమురాసురభంజనా! దాసజనచిత్తరంజనా! నీ విప్పు డేల భేదాభిప్రాయమును వహించితివి? ఓరూపజితమదన మోహనా! నీవు తటస్థుండవై యుండ నేల? ఓపరమపదతిలకా! నీ వేల నూర్ధ్వలోకంబునకుసైత మంటుచున్న మావంటి బాని సల దీనాలాపంబులను విని నివారింపఁ దలంపవు? ఆహా! ఎవ్వరితో మొఱబెట్టిన నేమిలాభము! పరమేశ్వరుడే విధిబద్ధు డైయున్నప్పుడు పాలించువా రెవ్వరు? మానవుల కీకర్మాను భవము, ఈదార్జన్యపాలనము, ఈనిరంకుశాధికారము—విధి పరిపాకకాలంబునఁగదా తప్పవలయు? అంతదనుక నెవ్వ రేమనుకొన్నను లాభము లేదు. (ప్రకాశము) అమ్మా! నా ప్రారబ్ధమునకు నిన్నడవలసినదేమి?

ప్రేమ—ఆప్రారబ్ధము నీశ్రాద్ధకాలమునగాని తీరదు.

చతు—అమ్మా! అటులే కావచ్చును, కాని యాశుభకాల మెప్పుడో కదా! •

ప్రేమ—కాఁదగిన యనుభవ మంతయు నైనపిదపకదా! నీ కా యదృష్టము

[అదృష్టగుప్తుఁడు ప్రవేశించును.]

అదృ—వదినా! అన్నగారింకను రాలేదా?

ప్రమ—నాయనా! అదృష్టగుప్తా!- వచ్చితివా!- ఇటు కూర్చుండుము. ఇప్పుడు నీకొఱకే కబురంపవలయునని యుంటిని.

అదృ—వదినా! కూర్చుండుటకు తగినసావకాశము లేదు. తొలుత అన్నగారి వృత్తాంతమేమో చెప్పుము.

ప్రమ—ఏమిచెప్పుదును నాయనా! ఇఁక నే వచ్చెదరో, ఇఁక నేవచ్చెదరో యని రాత్రియెల్ల వేచి ప్రజాగరము చేసి వేసరితిని. ఇప్పటి వఱకు వారిజాడయే లేదు. అప్రదేశ మంతటిదూరమున నున్న దా యేమి?

అదృ—ఏమీ? ఇప్పటివఱ కింటికి రానేలేదా? అట్లయిన నేదియో మహాపాయమే సంభవించినదని తలంపవలసి యున్నది.

ప్రమ—ఆ-ఆ-నానాథున కపాయము గలిగియుండునా! అదృష్టగుప్తా! ఇప్పు డేమిసాధనము? ఆచోరులు నానాథుని వధించిరనియే తలంతువా?

అదృ—వధించిరో సాధించిరో- ఇప్పు డేదికర్ణయింతమన్నను వీలులేదు. మీ రల్లరిచేయవలదు. మనమిపు డెంతమెలకువతో మెలగిన నంత శ్రేయము. నీభర్త తమ్ముఁడని నన్ను కనికరింపక నైశ్వర్య మదంబున నింటినుండి గెంటించినను రక్తసంబంధవాత్సల్యము నన్ను వదలఁ జాలదు. కష్టకాలంబున నేను మిమ్ముఁ గాపాడక తప్పదు. మీరు కలవరమును మనంబుననే దిగమ్రింగి యుండ వలయును గాని గందరగోళ మొనరింపకుఁడు.

ప్రమ—అయ్యో-అయ్యో-నా కిం కేది దిక్కు? నాథుఁడు మొన్నటి యుదయిముననే లేచి యీపాడు చతురమొగము జూచెనమ్మా! పాడ ముఁద-దీసిమొగమున నిప్పులు పోయ.

అదృ—ఆ-ఆ-దాని నేల నన్యాయముగా తిట్టెదవమ్మా!

ప్రేమ—ఇంత యన్యాయమున కీముండయే కారణము నాయనా!

చతు—అయ్యో! నేనేమి చేసితిని?

అదృ—వదినా! ఈచతుర......చతురా! నీవు పొమ్ము.

చతు— (నిష్క్రమించును.)

అదృ—ఈచతురను నీ వీసందిగ్ధసమయమున నీరీతి కారులాడుట తీరని కారామికి కారణమగును. దానిని నీ వెంత పెంచినను నన్నిహితురాలు కాదుగదా! మనరహస్యంబుల నన్నిటి నెఱింగిన దీనితో మన కిప్పట్టున చెలిమి శ్రేయంబు గాని-కర్జంబు కర్తవ్యము గాదు. దీనిని నీవిఁక నేమియు నాడకుము. తప్పున్నను తగవు పెంచవలదు. నీవిఁక లోని కరిగి శాంతచిత్తవై యుండుము. నేను మిఁగిలినపని చూచుకొందును.

(అనుబంధము 14)

ప్రేమ—నాయనా! అట్లే చేయుదును. ఇంత కన్న నేనుచేయవలసిన దేమున్నది?

(నిష్క్రమించును)

అదృ—ఛీ! ఛీ! ధనాశాపిశాచ మెంత చెడ్డది. ఇంతల కేనిచేయవచ్చును. తిలోత్తమ యనుమాటనుబట్టి నాయన్న గుహలోన చిక్కుపడి వారిచేతులలో మరణించి యుండునని తోఁచుచున్నది. కానిమ్ము. ఏమైనను తడవుచేసిన కార్యముగాదు. తొందర పడవలయును.

(నిష్క్రమించును)

## రెండవరంగము.

### మైరావణునిగుహ.

[లోభగుప్తునిశవము రెండుతునకలుగాఁ గట్టఁబడియుండును]

మైరా—సరదారులారా! మనరహస్యము నెఱింగి మన ధనమానంబుల నపహరింపఁ దలఁచిన దురాత్ముఁ డీపాతాళగుహాముఖంబునకు వ్రేలాడదీసితిమిగదా! ఇట్టిదుష్టుల కందఱ కిది ప్రాయశ్చిత్తసూచకముగా నుండునుగాక! ఈమైరావణునంతు దండిమగలగుండెలఁ దీయు గండరగండండని జగం బెఱుంగుఁగాక! మన గుహామర్మంబుల నింక నెందఱెంఱ తెఱింగి యుండిరో మనము ప్రయత్నించి యాతులువలంబట్టి పాలార్చి యిటులే యొనర్పవలయు. లేదేని యెంతమోసం బైన నగును.

సీ. మనగుహామర్మంబులను బొడఁగాంచిన
కలుషాత్ములను బొడగాంచువఱకు
అత్యంతమాయారహస్యరూపంబుల
వారి యీగడఁ బసిపట్టువఱకు
యీరేడుజగముల నెందుదూఱిన వాని
శిరము వేయివ్రక్కలు సేయువఱకు
దోర్దర్పమునఁ దునాతున్కలు గావించి
పీడక చీల్చి చెండాడువఱకు
వంచకుల నెల్ల రూపుమాయించువరకు
ఘోరవైరాగ్నిశిఖలు చల్లారువఱకు
మీర లప్రమత్తతతోడ మెలఁగవలయు
దయమునన్ వాని పొడగాంచి రండు పొండు.

(అనుబంధము. 15)

(అందఱు నిష్క్రమింతురు)

[అదృష్టగుప్తుఁడు ప్రవేశము.]

అదృ—నేను సైతము వీరికంటఁబడిన నిట్లే దుర్మరణముఁగాంచి యుందును. ఇప్పటికి భయము లేదు. నాసోదరుని కళేబరముం గొనిచని యిఁకముందు మరల నీగుహకు రాకుండెదఁ గాక! నాసోదరుని దుర్మరణంబు నీకన్నులతోఁ జూచినకొలఁదియు మనంబంతయు భయాకులమై కంపించుచున్నది. శరీరము జలదరించుచున్నది. ఔరా! పులినోట కండవలె నే నీఘోరరాక్షసులవారికి జిక్కియుంటినే; సత్వరం బరుగవలయు. మరల దొంగ లిందు వచ్చిరేని నేను శమనపురంబున ప్రాతకాపు నౌదుఁగదా! ప్రియబంధు వత్సలసమాదరా! సోదరా! ఎంతపాటు దెచ్చికొంటివి? నీవు నాతోడ నకారణబాంధవ్యంబు సలుపుట నీయవాంతరమర ణంబునకుఁ గారణంబయ్యెనా! ఐశ్వర్య మబ్బిన యనంతరమున రెండునాళ్లైన నీవు నామాట వినకుండుచు ప్రాప్తంబు లేక పోయెనుగా—చతురనిచ్చి నీకువివాహంబు సల్పెదనని మొన్న కదా యంటివి! నీవాగ్దత్త మంతలో నంతరించెనా! ఏకగర్భజని తులమై- భౌతికసుఖదుఃఖపరంపరలయందు భాగహారులమైన మన కీయెడబాటు గలిగించి నీకు నూతేళ్ళు నిండించి యాహాత విధి నిన్నపహరించెనా? సుగుణరాశీ! నీగర్భంబున వంశాంకు రంబగు నొక్కకుమారుండైనఁ గలుఁగకపోయెను గదా! “లోభ గుప్తుం డనుపేరు నాకు సార్థకమైనది. తమ్ముఁడా! ఈధనము లభిం చెనేని యాదుష్కీర్తిఁ బాపుకొందు” నని నీవంటివే! ఇప్పుడు ప్రాణంబులనే బాపుకొంటివిగదా! సోదరా! లోకసామాన్య మరణంబు నందినవాఁడవేని నీమృతికి దుఃఖించియుండము గాని- ఘోరరాక్షసులనడుమ, కరవాలంబున రెండుతునకలుగాఁ జీల్పఁ బడి గుహకు వ్రేలాడదీయఁబడి యింటవారు పక్షుల కాహార

మైతిలా! హా! ఘోరము! ఘోరము! ఈవిచారము మా వధూనిక యెట్లుభరించు? నాకెన్ని నాళ్ల కీవంత యంతరించు?

[తెరలో చప్పుడగును]

అదృ—ఓహో! కడుమోసము సంఘటిల్లె—ఆచోరు లిందు వచ్చుచున్నటులున్నారు. శీఘ్రముగా నీతావు వదలి చనవలయును. సోదర మరణంబునకు దుఃఖించుట కిది తఱిగాదు. ఈశవము నెవ్వరైన గాంచిరేని గుట్టు బయల్పడును. ఈకళేబరఖండంబులం గొని యగ్నిసంస్కారము గావించి క్రిమ్మకొనవలయును.

(శవఖండములతో నిష్క్రమించును.)

[దొంగలతో మైరావణుడు ప్రవేశము]

(అనుబాధము 8)

మైరా—(శవము లేకుండుటఁజూచి, ఆశ్చర్యపడి) హా! ఏమి యాశ్చర్యము. ఇంతటి సాహసం బొనరించిన యాదురాత్ము లింకెంతైనఁ గావింపఁగలరు. పరివారములారా! ఈదురాత్ముల దురాగతంబు నాకమితాగ్రహంబు గలిగించుచున్నది. మన మాటులరిగి కొన్ని క్షణంబులైనఁ గాలేదు. ఇంతలో నాపాపాత్ములు వచ్చి శవఖండములం గొని చనిరి. వారనతిదూర మరిగియుందురు. కావున వెంబడించి వారిం బరిమార్పవలయు. వారి సహచరులు మఱి యెందఱుగలరో మన మెఱుంగవలయు. మనగుట్టు బయలుపడిన రాజదండనంబు నందుదుము. మీ మీ చాకచక్యంబులు మెఱయ క్రోధతామ్రాక్షులై బయలుదేఱుడు. ఈప్రయత్నంబున మీప్రాణంబుల కాసింపరాదు. లెండు- ఆయత్తముగండు- వారి వెంబడింపఁ బోండు.

(అనుబంధము 16)

(దొంగలు నిష్క్రమింతురు.)

మైరా—హా! కష్టము. కష్టము.

చ. నలువదిమంది చోరుల యనర్గళదివ్యపరాక్రమక్రమా
విలసనమెల్ల నేఁటి కొకభీరుని మూలమునన్ నిరంకుశో
జ్జ్వలగతి మాని డీలువడి బాహుపరాక్రమ ముజ్జగించి దు
ష్ఫలమును గాంచనయ్యెఁడి! విచారము దీనెడుదారి యేమొకో?

ఇంకనట శ్రీమైరావణుండు తా నాడినదాట- పాడినదిపాటగా నిరంకుశ ప్రతాపంబు చెల్లుబడియగుచుండె!- కుబేరుని ద్రవ్యసంతానంబులు నాకు దిగదుడుపులకైనఁ బనికిరావయ్యె—కార్తికేయుని ప్రతాపము నాయెదుట రవిదీపన్యాయమయ్యె-జమునిశాసనంబు నాయెదుట వ్యతిరేకమయ్యె- విధివ్రాలు నాచేఁ బరిపూర్ణముగాఁ దుడువబడుచుండె- ఆభగవంతుఁ డెచ్చటనుండెనో నాకు తెలియదగనిదయ్యె- ఆహా! ఇప్పుడు నాదుర్గతి కేమందును- దీనికేవిదారి?-ఏప్రతిక్రియ నాలోచింతును?-ఏమిచేయుదును? ఈ దుర్మార్గుఁడొకఁడో పదిమందియో తెలియఁబడదయ్యె- ఎవ్వఁడైన వీఁడద్భుతమేధావిశారదుఁడనుటకు సందియము లేదు. జగచ్చండశాసనుఁడగు మైరావణుని కన్నుగప్పి టలంతియనియే యీతులువ తనమనంబునఁ దలంచెగా?-ధనలోభంబు వహించి తస్కరించెఁబో, నాకు ప్రతిస్పర్ధియై నిలచి నన్ను సాధింపనెంచునే? వాని నేల రాచి-కండలు వెదజల్లి—నాపరాభవము దీర్చుకొనకుందునే? క్షణమాత్రంబైన నేమఱక- నన్ను నీడవలె ననుసరించి రక్షించు పరాక్రమశాలురగు నలుబదిమంది మల్లులాప్రొల్లదుని బట్టి పాలార్చి చీల్కలుపేల్కలుగాఁ జేయకుందురే? ఛీ—వీఁ డనసైంత? వీనికై నేనింతగా సంతాపంబు నందఁజనదు. కలభంబునట్లు వీని మత్క్రోపాగ్నిని వ్రేయింతు—

సీ. భూధరంబులచక్కఁ బొంచి పక్కలనిక్క
దండిగాఁ దోఁచుపచండు లుండ
ఒడుపున మెడలందు నురులుదగిల్చి జ
క్కాడెడు పిండారిగండు లుండ
మారువేసాల నున్మత్తప్రలాపంబు
లాడుకత్తెరదొంగ లమరియుండ
తైలాంజనము మేనఁ దాల్చుకన్నపుదొంగ
లతిసాహసులు నాకు నండఁ గల్గ
స్వర్గ మర్త్య పాతాళ ప్రపంచములను
పంచబంగాళముగ వణికించఁ గల్గు
నధిపు నాచేత కరవాల మమరియుండ
నడలుఁజెందఁడె దేవుని యబ్బ యైన.

(అనుబంధము 17)

(నిష్క్రమించును.)

3 రంగము:—జంబూకుని గృహప్రాంతము.

చతు—(ప్రవేశించి) ఎంత దుర్మార్గుఁడై చరించినను దిక్కులేని నా కిన్నినాళ్ళనుండియుఁ బ్రభువగు నీలోభగుప్తుని దుర్మరణముం దలంచుకొనినకొలఁదియు నాదుఃఖ మాఁగుటలేదు. "పరుల కనుమానము గలుగకుండ నీ యిరుతున్కల నొక్కటిగాఁ గుట్టించి దహనము గావింపవలయు" నని మాయదృష్టగుప్తుఁడు చెప్పినమాట యెంతయు సమంజసముగ నున్నది. ఈపరిసరము ననే నే నెఱింగిన జంబూకనామధేయుం డగు నొక ముసలిదర్జీ యుండవలయును. వానికన్నులకు గంతలుగట్టి కుట్టించి స్వామి ఋణముఁ దీర్చుకొందు. ఇచ్చట విశేషకాలము జాగుచేయుట

వలన లాభములేదు. కర్తవ్యముఁ బరికింపవలయు- ఇదే జంబూ
కుని యిల్లువలె నున్నది. జంబుకా! జంబూకా!

(తలుపుతట్టును)

[జంబూకుఁడు ప్రవేశము.]

జంబూ—ఎవరువారు? ఎవరువారు?

చతు—తాతా! ఇటుచూడుఁడు- నేను-చతురను.

జంబూ—చతురవా! ఏచతురవే పిల్లా? నాబుద్ధికి జ్ఞాపకశక్తి తగ్గి
పోయినది సుమా!

చతు—నేను తాతా! లోభగుప్తునింట నుండుదానను. నీవు నల్లమందు
కొఱకు వచ్చువాఁడవు గాదా!

జంబూ—అవునే!-అవునే-చతురా!- తెలిసినది. నే నీనడుమ నొక
యేడాదినుండియు యిల్లువదలి రాలేక- పొరుగింటి శరభన్నదు
మందు తెప్పించుకొనుచున్నానులే!

చతు—అవును. తాతా! అందులకే- బహుదినములయ్యె-చూచి పోవల
యునని వచ్చితిని.

జంబూ—అబ్బా! ఎంతబాంకితివే- నీయిల్లు నేలగట్ట!-నీవెక్కడ?
శ్రీమంతుల యింటిబిడ్డవు. నేను దరిద్రుఁడను. నాయింటికి నీ
వూరక చూడవత్తువా?-నేనేమి లోకజ్ఞానము లేనివాఁడ నను
కొంటివఁటే!- ఏదో పని యుండియే వచ్చితివి చెప్పు-చెప్పు-నా
ప్రాణము విసిగించక నీవు వచ్చినపని యేదో తెమల్చు.

చతు—తాతా! పనిలేక రాలేదుగాని- నీలాభనష్టము లెట్లున్నవి? పని
బాగుగా సాగుచున్నదా?

జంబూ—లాభనష్టముల కేమిలే!-నా యొక్క-పొట్ట పూడకపోవునా?-
చతురా! నీయజమానుడు బాగున్నాడా?

చతు—అటు లడిగితివేమి?—

జంబూ—అదికాదు. మగవాడుండగా నీవు వచ్చితివేమని సంశయ
పడితిని.

చతు—జంబూకా! మగవా రున్నమాత్రమేమి?-నేను చేయునది వా
రింటి ఛానిసతనము గాని ప్రభుత్వము కాదుగదా! సరికాని—
తాతా! మా లోభగుప్తుఁడు నీకిది పంపినాడు చూడు.

జంబూ—ఆ!-ఆ!-ఏమే చతురా! నాదృష్టి సరిగా కనపడుట లేదేమో!
ఇది నిజముగా నూఱురూపాయల కాగితమేనా?—

చతు—సంశయము లేకుండ—ఇది నీకు మాయయ్య బహుమానముగఁ
బంపినాడు.

జంబూ—అకారణముగనే! అబద్ధము కాదుగదా! అబ్బే!-మొదలే
లోభగుప్తుఁడు. అతఁడేల పంపును? ఎందులకే నాతో పరిహా
సము చతురా!—

చతు—పరిహాసముకాదు తాతా! నీతోడు.

జంబూ—ఆ-నిజమేనఁటే! భళిభళి! చతురా! మీ లోభగుప్తునకు
నూరేండ్లు నిండును గాక! నీవెంత ఛటాకారివే!

(అనుబంధము 18)

చతు—తాతా! నీవలన నొకపని గావలసివచ్చినది సుమా!—

జంబూ—ఆ-అదిగో! పిల్లా! నేను చెప్పలేదఁటే?-ఈతగింజవేసి తాటి
గింజ లాగవలయునని వచ్చితివి. నీ వూరక నూఱురూపాయలఁ
దెచ్చితివా!

చతు—తాతా! మాయయ్య కొక గొప్పచిక్కు వచ్చినది. ఎవ్వరితో
చెప్పవుగదా?

జంబూ—అబ్బే! నీతోడు-చతురా! నాచెవిసొబడ్డరహస్యము నీటఁబడ్డ
రాయివలె యెక్కడికీ బోవదని నమ్ము.

చతు—సర్కారుసంబంధమైన నూరెబుంగ యొకటీ—విలువగలది—

జంబూ—ఈనడుమ మీ లోభగుప్తుడు నూనెబుంగలవ్యాపారము చేస్తున్నాడా ?

చతు—అవును. సంగతివినుము. ఆబుంగ యేకారణముననో చినిగిపోయినది. కుట్టవలయునని నిన్నుఁ గొనిరమ్మనెను.

జంబూ—చతురా! తెలియ కడిగెదను. కోపపడకు-దాని నిందేల గొని రారాదు—నేనేల రావలెను?

చతు—ఊరక వచ్చుటమాత్రమే కాదు. నేను నీరెండుకన్నులకు గంతలుకట్టి తీసికొని పోవుదును.

జంబూ—ఏమీ! యింత రహస్యము. మీ బావెవ్వరినైన ఖూనీ చేయలేదు గదా!

చతు—ముసలిముండకొడుకవు—ఏదియో కల్పించి యల్లరిచేయుఁగలవు. పని యైనతరువాత నీకు మఱి నూఱురూపాయలు బహుమానము దొరకును.

జంబూ—ఓ- అయిన నిఁక సంశయము లేదు. నిజముగా శవమైనను కుట్టెదను లే-పద-సరేగాని, నేను ముసలివాడను. నేను చేసిన పని నీకు నచ్చునో; నచ్చదో?

చతు—ఛీ- నీశృంగారము చితక- పద- పద.

(గంతలుకట్టి తీసికొనిపోవును.)

(అనుబంధము 19)

(నిష్క్రమింతురు.)

## 4 వ రంగము.

[దమనకుఁడు ప్రవేశించును.]

దమ—“కలి పోసిపెట్టినా వుట్టివంక కేచూచె” నన్నట్లు మాకరటకుడు గాడిదెకొడుకు- లోభగుప్తుడు తన్నువదలినా- తానుమాత్రము

లోభగుప్తుని పాడుకొంప వదలలేను. మల్లిశెట్టి పుల్లిశెట్టి వల్లకాట్లో గలిస్తే- నడుమనున్న నాగిశెట్టి బాగుపడ్డట్టు అదృష్టగుప్తుని పని బాగున్నది. కట్టెలమోత పోయి- కాసుల మోత వచ్చినది. గయ్యాళిముండ ప్రమదకుమారిత్రము మంచి ప్రాయశ్చిత్తమైనది. కార్యములకయినా గరిటెడు బ్రాందినీళ్ళు ఖర్చుచేయని పాడుకొంపలో—తొత్తువలె కరటకుడున్నను నే నుండను. వంగలేనివాడు దొంగలలో గలిసె ననుసామెత మా కరటకుడు చెప్పనేచెప్పినాడు. ఏదొంగలలోనైనా కలిసెదను. దొంగలకు వేరుగా కొమ్ములున్నవా? దొంగ లేదేశమునవో వేరుగా పుట్టుదురా! ఎవడుదొంగతనముజేసిన వాడే దొంగ— అదిగో-ఎవరో యిద్దరీవంకకే వచ్చుచున్నారు. ఒక ధనికుని వేషము వేసికొని వీరిలోచేరి మొదట ఘరాణాదొంగతన మారంభించెదను. (చాటున నుండును.)

[రేచుక్క పగటిచుక్క అనువిద్దఱు దొంగలు ప్రవేశింతురు.]

పగ—ఓరీ! రేచుక్కా! నే నీవేళ నీతో దొంగతనానికి రానుపోరా!

రేచు—ఎందుచేతరా! పగటిచుక్కా!

పగ—ఇక్కడికి రెండునెల్లనుంచి నాకు పెళ్ళిచేయుమని మన మైరావణరాజుగారిని అడుగుతున్నాను. చేశాడే కాదు—పెళ్ళిచేసుకొంటే నేను దొంగతనమే చెయ్యను.

రేచు—ఉండుండు. అప్పుడే తొందరపడకు. మన డబ్బు దొంగిలించే దొంగ దొరికినతరువాత మనపెద్ద నీకు తప్పక పెళ్ళిచేస్తాడులే.

పగ—ఏంచేస్తాడోరా! ఈ లోపల మనపెద్దకే- పెద్దపెండ్లయ్యేట్టు కనపడుతూంది.

రేచు—ఛీ- అదేమిమాట ?

పగ—నీ పూరక అభిమానానికి పడి ప్రస్తావుగాని- ఇంత రాద్ధాంత

మైనతరువాత మనదొంగతనాలు సాగునా? మనడబ్బు నిలచు నటరా?

రేచు—ఆసంగతి తరువాత చూచుకోవచ్చునుగాని నీవీదారిన వెళ్ళు; నే నాదారిన వెళ్ళుదును. దొంగతనానికి పాచిక పారకున్నచో మన శత్రువునైనా వెనుకు. శత్రువుజాడ యేయబద్ధమో కల్పించియైన చెప్పుకున్నచో మన దొరవలన మాటవచ్చును.

పగ—నీమాటమీ దున్నానుగాని పంపనిరాయిది—చండాలప్పని— పెళ్ళీలేదూ పెటాకులూ లేదు.

దమ—(తనలో) నేను దొంగిలింపవలెనని వస్తే- వీళ్ళే నాపాలిటికి దొంగలైనారు. వీళ్ళకంట బడకుండా పారిపోవడమే యిప్పుడు గొప్పపని.

[పారిపోబోగా రేచుక్క పట్టుకొనును.]

రేచు—ఎక్కడికి పోతావురా? నిలువు. నీదగ్గిరేముందో పెట్టి కదులు.

దమ—(తనలో) తన్నబోయి తన్నులు దిన్నట్లయింది నాపని. ఐనా భయములేదు. (ప్రకాశముగ) నాదగ్గరేమీ లేదు. అబ్బే! నన్ను కొడితే నీకొచ్చేలాభమేమీ లేదు.

రేచు—ఊరపందివలె బలిసి- గంగిరెద్దువలె బొంతలు మీద వేసు కున్నావు. చూస్తే వర్తకునివలె నున్నావు. యెరనియేగాని లేకుండా ఎందులకు వచ్చితివి. మాకేమి మడులున్నవనుకొ న్నావా? మాన్యాలున్నావనుకొన్నావా? మాకు వర్తకాలా! అమ్మకాలా! వట్టిచేతులతో చెవులుకోసినకుక్కవలె పరుగెత్తు కొని ఎప్పుడూ రావుగదా!- రావుగదా!- (కొట్టుచున్నాడు.)

దమ—బాబూ! కొట్టకు- కొట్టకు- అదిగో కొట్టకుమనగాను—

రేచు—(చెవులుపట్టుకొని సాగదీయును) ధన మెక్కడ దాచితివో చెప్పు—చెప్పకపోయితివా నీ చెవు లూడదీయుదును.

దమ__ఇదిగో- చెవులుమాత్రము వదలు- సావకాశంగా చెప్పుతాను.

రేచు__(వదలి) ఇప్పుడు చెప్పు. పారిపోయితివా- పాతరవేయిం చెదను- జాగ్రత్త.

దమ__నీతోడు- నాతోడు- భూమితోడు- ఆకాశంతోడు- నాదగ్గర దమ్మిడీ యైన లేదు. కావలసియుంటే సోదా చూచుకో.

రేచు__(సోదాచూచి) ఇంటివద్ద నేమైన వున్నట్లైనా?

దమ__ఆ- కావలసినంత యున్నది. నేనున్నయింటిలో ధనము లేదని యెట్లబద్ధ మాడగలను ?

రేచు__నాకు ధనమిమ్మని యొకచీటి వ్రాసి యిమ్ము. తెచ్చుకొందును. వ్రాయకపోతివా- చంపెదను.

దమ__(తనలో) నాకక్షరములేరావే? ఎట్లు వ్రాయగలను. వీనికిమాత్రము వచ్చునా? అక్షరములే వచ్చిన వీ డీదొంగపనులు చేయనేల? (ప్రకాశము) వ్రాసి యిచ్చెదను. తీసికో!- నూరు రూపాయలు చాలునా?-

రేచు__నాకు బోడిబాపనివాడికి చేసినట్లు దానము చేసెదవురా పిసినిగొట్టుపీనుగా ? ఐదువందలు వ్రాసెదవా?__అడకత్తెరలో నొక్కి- చంపనా?

దమ__(తనలో) సన్యాసి సన్యాసి కలిసిన బూడిద రాలినదట. నావద్ద నేమో యేడ్చినదని వీని భ్రమ__సరే ! ఆ బెట్టుసరి పోగొట్టుకొననేల? (ప్రకాశము) బాబూ ! కొట్టకు- అట్లే వ్రాసెదను. ప్రాణములతో మాత్రము వదలు__

రేచు__సరే! నాకే అపాయమూ రాకుండా వ్రాయి- చదువుకొందునుసుమా!

దమ__సరే! ఈమాటతో వీని కక్షరజ్ఞానము లేదని పూర్తిగా తేలి

నది. (ప్రకాశము) మరి యెక్కడ వ్రాసియిప్వను? నావద్ద నిప్పుడు కలమూ! కాగితమూ!

రేచు—ఇదిగో చూడు, ఇందాక నీవంటి పిసినిగొట్టువీడు గొకడు దాపురించగా వానివద్ద నొక కోటుండగా లాగుకొంటిని. అందులో నొక కలము పుస్తకము వున్నవి. (కాగితములు చింపి కలముతో నిచ్చును)

దమ—(తనలో) ఏవియో నాలుగు గీతలు గీసి యిచ్చెదను. వీనినుండి బయట బడినతరువాత చూచుకొందము. (వ్రాసియిచ్చి) ఇక నన్నువదలు బాబూ- వదలు.

రేచు—సరే- పో. (కొంతదూరము నడచి) పోనీ- ఈ యవస్థయంత యునేల? నీవే యింటికి వచ్చి యీయగూడదా! పోనీలే!- నీవు వచ్చినచో నన్ను పోలీసులకు పట్టి యీయగలవు.

(నిష్క్రమించును.)

దమ—అమ్మయ్యా! ఈ ముండకొడుకును బుట్టలో బెట్టితిని. తిరిగితిరిగి వీడు చావనీ! ఇక దొంగతనమున కొక దండము బాబూ! మా కరటకుని పనియే బాగున్నది.

రేచు—(తిరిగి ప్రవేశించి.) ఓరీ! ఉండుండు. నాకొక సంశయము తోచుచున్నది. నీవిందు వ్రాసిన యిల్లు, వీధి సరిగా నున్నదో లేదో నాకేమి తెలియును. నేను కనుగొని వచ్చువరకు నీవిచ్చటనే యుండుము. అబద్ధమగునేని నిన్ని చెట్టున కురిదీసెదను.

దమ—నిజమే-బాబూ! నిజమే- నీవు చచ్చినంతొట్టు- నన్ను చంపకు.

రేచు—నిజమయిన నిన్ను వదలుదునులే!- నీకేమియు భయములేదు, నిన్ను కట్టిపడవేసెదను. (త్రాటితో కట్టి నిష్క్రమించును.)

దమ—వంగలేనివాడు- వల్లకాటికి బోయినా మంచిదిగాని దొంగలలో కలవకూడదురా బాబూ! నాలాటి సోమరిపోతుల కొఱకు తం

జాపూరిసత్రి ముండగా నే నిట్లు బయలుదేఱనేల? నాచావు నేడు తప్పదు. కరటకా! నీమాట వినకపోతినిరా బాబూ!

[పగటిచుక్క ప్రవేశించును.]

పగ—ఛీఛీఛీ!- ఎక్కడ తిరిగినా- ఎర్రినియేగాని దొరకలేదు—సరి కదా! ఎర్రినిపడుచైనను కనపడలేదు. ఇంత పాదురోజిదే గాని యింకొకటిలేదు. పెండ్లో పెండ్లో యని నే నేడ్చుచుండగా, దొంగతనమో, దొంగతనమో యని యీ ముండకొడుకులు నన్ను మరింతయేడ్పించుచుండిరి. ఏమహానుభావులైనా, నాకు కూతురు నిచ్చి పెండ్లిచేసి యిల్లటముంచుకొన్న యీదొంగ తనము మాని సుఖపడుదును.

దమ—(తనలో) అదుగో!- ఇందాకటి పెండ్లిపిచ్చిదొంగ వచ్చినాడు. ఇప్పుడొక పెద్దకపటము పన్ని యీ చెర తప్పించుకొందును. (ప్రకాశముగా) నాకు పెండ్లి వద్దు- నాకుపెండ్లివద్దు - నాకు పెండ్లివద్దు—(ఏడ్చుచున్నాడు)

పగ—ఎవడవురా? నీవు- ఇటుచూడు.

దమ—ఊ- ఊ- నాకు పెండ్లివద్దూ -

పగ—ఓరీ- మొద్దూ- జవాబు చెప్పవేమి ? నీ కీ బలవంతపుపెండ్లి యేలవచ్చినది?

దమ—బాబోయ్- నాకు పెండ్లివద్దు- అమ్మోయ్- నాకు పెండ్లివద్దు- నాకుపెండ్లివద్దు- నాకు పెండ్లివద్దు- ఊ- ఊ- ఊ—(పెద్దగా ఏడ్చును.)

పగ—(దమనకుని తలపట్టి పైకెత్తి) ఎవడవురా నీవు ? చెప్పెదవా ? చంపుమందువా?

దమ—(తలయెత్తి) మీ రెవ్వరు బాబూ ! మామామ వంటివాడు కదా !

పగ—నీకేల పెండ్లి వద్దు ?

దమ—వద్దు బాబూ! నాకు పెండ్లి వద్దు—నాకు పెండ్లి వద్దూ—

పగ—తోక తెగిన నక్కవలె కేకలు వేయుట మానెదవా ? చావగొట్ట
వలెనా? నేను నీ మామవంటివాఁగా రాలేదు. నీ వెవఁడవు? నీ
కీపెండ్లి యేమి? పెండ్లికొడుకువగు నీకీ కర్మేమి ?

దమ—చెప్పమందువా బాబూ! నాకు పెండ్లి వద్దనుచుండగా మా
బాబు మా మామ కప్పగించి పోయినాడు. మా మామ న
న్నిక్కడకట్టిపడవేసి పెండ్లికూతురిని తీసికొని వచ్చుటకూరిలో
నికి వెళ్ళినాడు. ఒక గడియలో వచ్చును.

పగ—నీ వేల పెండ్లి వద్దంటివి ?

దమ—నాకు పెండ్లామును చూచిన దయ్యమువలె కనబడును. నాకు
పెండ్లి వద్దు బాబూ! పెండ్లి వద్దు.

పగ—అట్లయిన నాకా పెండ్లి చేయించెదవా ?

దమ—ఓ నిముసములో నీకు పెండ్లి యగును. నా కట్లు విప్పి వేసి నిన్ను
కట్టి యిక్కడ నుంచెదను. మామ వచ్చినప్పుడు నాకు పెండ్లి
వద్దు అని యేడ్చుచుండుము. అంతే, నీకు పెండ్లి చేయుదురు.

పగ—సెబాస్. ఈ యుపాయము బాగున్నదిరా! నిజముగా పెండ్లి
యగునా?

దమ—ఓ- నిజముగానే పెండ్లి యగును.

పగ—మరి నన్ను గుర్తుపట్టి పెండ్లికొడుకును కానని విడిచిపోదురేమో!

దమ—గుర్తింపలేరులే! వాండ్రు నన్ను నయినను బాగుగా చూడ
లేదు. నీ కెందులకు? నాకు పెండ్లి వద్దని యేడ్చుచుండుము.
పెండ్లి చేసెదరు. ఏడ్వకపోయితివా- మువ్వురు పాటిల్లును.

పగ—బాగుగా నేడ్చెదను. శోకములు దీసెదను. పోనీ! ఎందుకయినా

మంచిది. మొగము కనుబడకుండ మొగముపై నొకగుడ్డ కప్పుము.

దమ—నీయిష్టమువచ్చినట్లు చేయుదును. ముందీకట్లు విప్పుము.

పగ—(కట్లువిప్పగా దమనకుడు వానినిగట్టి గుడ్డ కప్పును.) ఇక నీవు శీఘ్రముగా నిక్కడనుండి వెళ్లు.

దమ—చావు—ముండకొడుకా! చావు. (నిష్క్రమించును.)

[రేచుక్క ప్రవేశము.]

రేచు—(తనలో)ఎంతమోసగించినాడురా యీదొంగ గాడిదెకొడుకు! వీని నీచెట్టు కురిదీసినను పాపములేదు. ఏడీవాడు- ఇదుగో! ఇంక నిక్కడనే యున్నాడు. (కొట్టుచు) దొంగముండకొడుకా! నన్ను మోసగించితివా? నిన్ను చంపెదను.

పగ—(ముసుగులోనుండి) నాకు పెండ్లివద్దు—నాకు పెండ్లివద్దు— (ఏడ్చును)

రేచు—ఛీ! ఛీ! నీకు పెండ్లి గూమిరా? దొంగా! చావు-చావు- నీ కిదే పెండ్లి. (కొట్టును)

పగ—నాకు పెండ్లి అక్కరలేదు. నాకుపెండ్లి అక్కరలేదు. (ఏడ్చును)

రేచు—అరే! ఎవడువీడు? కంఠస్వరము వెనుకటిదిగాదే? ఎవడవురా నీవు?

పగ—నాకు పెండ్లిఅక్కరలేదు.

రేచు—పగటిచుక్కా!

పగ—నాకు పెండ్లి అక్కరలేదు. నాకు పెండ్లి అక్కరలేదు.

రేచు—పగటిచుక్కా! ఇదిగో! నేను.

పగ—రేచుక్కా!

రేచు—(ముసుగుదీసి) ఓరి నీవటరా! నిన్నెవ్వరు కట్టినారు? నీకు పెండ్లి యక్కరలేకపోవుటయేమి? పిచ్చిపట్టినదా!

పగ—పిచ్చి కాదుండరా! పెండ్లి అగును. నీవిక్కడ నుండకు. వెళ్ళిపో-
ముసుగు బాగుగా కప్పు.

రేచు—ఛీ! ఛీ!! వెర్రిగాడిదకొడకా! వాడేడిరా! నేను కట్టి పడ
వేసినవాడేడి?

పగ—నీవెవ్వరిని కట్టితివిరా?

రేచు—ఒక బాటసారి నిక్కడ కట్టి వేసితినిరా!

పగ—నీవా! కట్టినది?

రేచు—అవును.

పగ—అన్నా! మోసము చేసినాడురా గాడిదకొడుకు! కట్లు విప్పు
ముందు.

రేచు—(విప్పి) ఏమిచేసినాడు? నన్ను మోసపుచ్చినాడు. ఇంటికి
డబ్బునకు చీటి వ్రాసినాడు. ఇల్లు లేదు—వల్ల కాదు లేదు.

పగ—పెండ్లి వద్దని ఏడ్చుచుండినచో తనమామవచ్చి పెండ్లి చేయునని
బొంకినాడురా! నేనాశ పెట్టుకొని యిట్లేడ్చుచుంటిని.

రేచు—ఓరి నాగన్నా! వానిబుట్టలో పడితివా!

పగ—ఓరి పెద్దమ్మా! నీవు పడలేదటరా!

రేచు—వాడెవడో దొంగలమిండడురా!

పగ—వాడు దొరకిన నేమిచేసెదనో చూడు.

రేచు—సరి లే!-ఎవరితో నీమాట చెప్పకొకు. పద పద.

పగ—నీవును చెప్పకొకు—పదపద.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)



5 రంగము:—మైరావణుని గుహ.

మైరా— (అనుబంధము 8)

పరివారములారా! నేటివరకు నాదురాత్ముఁడగుమనవైరి జాత రవంత
యైన నెఱుంగరాదయ్యెను. ఏమిచిత్రమిది?—వాఁడెంతటిఘటి
కుఁడైననైయుండు—ఎట్టికట్టడిపనులకైన వెనుదీయనిదిట్టఁడైనఁ
గావలయు. భయానకంబగు-మైరావణగుహాంతరాళము నేమి?
నిర్భయుంబుగ నొక్కండు ప్రవేశించి యొంతెంతటి కార్యంబుల
నైన నాచరించి మనచేఁ జిక్కకుండ దక్కుటేమి? దినదినంబును
మనధనంబు క్రమంబుగ నదృశ్యంబగుచున్నది. ఇందులకు మీ
రేప్రతిక్రియయుఁగావింపలేదు. మనధనంబునపహరించి మనగుట్టు
వెలిబెట్టిన కట్టడింబట్టి గిట్టింపలేని-దిట్టతనంబు చచ్చిన వట్టికవా
కారంబులగు మిమ్ముఁగాంచిన నాకోపంబు మితిమీఱుచున్నది.
నే నిందుల కేమిచేయుదును. మీ తెలివిలేమికి నిందింతునా?
మనదురదృష్టంబునకు వగతునా? ఓహో! ఏమిది? నాచండ
శాసనంబు నేఁడు మండిపోవునా? ఆదుండగీడు నిండు ధనవం
తుఁడై యీగండరగండని మైరావణుని చేతఁబడక-ఖ్యాతినంది
జీవింపఁగలఁడా? పరిజనంబులారా! దీని కేదిమార్గము? ధనహీ
నంబగు నీగుహాం దిలకించినకొలందియు నామనం బతిడోలాయ
మానం బగుచున్నది. (అనుబంధము 20)

పరిచరులారా! సావధానముగ వినుఁడు.

సీ. కందుకంబులఁ జేసి గ్రహముల నాడింతు
తారకాగణమెల్ల తల్లడిల్ల
సోమసూర్యులఁ బట్టి క్షోణిపైఁ గొట్టెద
కదలి దిక్కులు గడగడ వడంక

పాశంబుతోఁ బ్రేతపతిని బంధించి యీ
మన్కిని నుంతు సంరక్షకునిగ
మానసంబున కనుమానంబు గల్గిన
బలియిత్తు కాళి కవ్వారినెల్లఁ
చండశాసనరూపభీషణుఁడ నైన
నేన మైరావణుఁడ నైతి నేని వినుఁడు
పట్టిపాలార్తు నాశత్రుగు బ్రిటించి
నన్ను మీఱినవాఁ డిల నున్నవాఁడె.

మీలో నెవ్వఁడైననొక్కండు సంపూర్ణప్రియత్న మొనర్చి తేఁగలవాఁ డున్నచో ముందునకు వచ్చి నిలువుఁడు. లేనిచో నేనే స్వయంబుగ నరుగువాఁడ! నాపగవానిని గనిపెట్టిన మగవానికి నాధనమున సగపాలొసంగెద. వింటిరా?

(అందఱు ఒకరి మొగ మొకరు చూచుకొందురు)

పగ—స్వామీ! ఈదాసుడు సిద్ధముగ నున్నాడు.

మైరా—సెబాస్! పగటిముక్కా! ఇందఱిలో నీవు నామనస్సునకు నచ్చినవాఁడవు. నీవు నాపగవానిని బరిమార్చిగాని, పట్టి తెచ్చిగాని, నామనంబునకుఁ బ్రీతిగొల్పుదువేని—నాధనమునం దర్ధ మొసంగుట నిజము కాని, లేకున్నచో నేమగునో యెఱుఁగుదువా?

పగ—నాశరీరమును రెండుగా చీలి యీగుహకు వ్రేలాడఁదీయుదు స్వామీ!

మైరా—సెబాస్! ఎఱుంగుదువుకదా! అంతపనియుఁ జేసితీరువాఁడను సుమా! శీఘ్ర పొమ్ము. జాగరూకుఁడవై మెలంగుము.

పగ—చిత్తము స్వామీ!

మైరా—లెంకలారా! మనపగటిముక్క మిగుల జాగరూకతగలవాఁడు.

కావున నిందు ప్రమత్తుఁడు కాఁడు. మన మది కానందము కల్గు గాక! మన మింక మనపనులపై నరుగుదము. రండు.

(అనుబంధము 8)

(నిష్క్రమింతురు.)

## 6 వ రంగము.

[వీధిలో జంబూకుఁడు ప్రవేశము.]

జంబూ—వహ్వా! వహ్వా!!-ఈవేళ నేను లేచిన వేళా విశేష మేమోకాని-లెక్కలేనిధనము దొఁరకినది- అదృష్టగుప్తుకు చేసినపని న్యాయమైన నాకేమి!- అన్యాయమైన నాకేమి? ఆతడు నూనెబుంగ యని యెంతబొంకు బొంకినను-నేనది చీల్పబడి రెండు తునకలయినశవమని గ్రహింపకపోలేను. శవమైన నేమి!-ఏమైన నేమి? ఎ డబ్బు నాకుదొరికినది. వహ్వా! వహ్వా! నా అదృష్టము.

[పగటిచుక్క ప్రవేశము.]

పగ—వీడెవ్వడో ధనలాభము గల్గినవాని చందమున గంతులు వేయుచున్నాఁడు. వీనియానందమున కేదియో కారణ ముండకపోదు. ఏమోయితాతా! ఏమి గంతులు వేయుచుంటివి?

జంబూ—పైసా-పైసా-పైసా
పైసా-పైసా-పైసా
మోదకరీ పైసా-
ఆనందకరీ పైసా-
ఎంతోభ్రాంతిని గలిగించెన్
పైసా-పైసా-పైసా- (ఎగురుచుండును.)

పగటి—(తనలో) ఎవరో యీబీదముసలివానికి కష్టపడకుండ ధనమిచ్చినారు. ఊరకడబ్బిచ్చుటకు వూరివా రచ్చియున్నారా?

ఇందేదియో గూఢతంత్ర ముండవలెను వీఁడు దర్జీవాడని నాకు జ్ఞాపకము. ఒకవేళ నాశవమును వీనిచే కుట్టించియుందురేమో! (ప్రకాశముగా) తాతా! పైసాయనుచున్నావు? పచ్చబడినదా వ్యవహారము.

జంబూ—ఎవడవోయ్ నీవు—పచ్చబడక నాకేమికొరత? రెండుతో ళ్లుకుట్టి రెండు వేలు సంపాదించినవా డెవ్వఁడు నాకన్న?

పగ—(తనలో) ఆ! నాఅంచనా సరిపోయినది. దారికివచ్చుచున్నాడు. (ప్రకాశముగా) ఛీ! ఛీ!! ఇందుకే పైసాపైసా యని ఎగురు చున్నావా?—తాతా! ఆమహాదాత యెవ్వడో? రెండు త్రోళ్ళు కుట్టించుకొని రెండు వేలిచ్చినాడు. అవి చచ్చినశవము త్రోళ్ళేకాదా! తాతా!

జంబూ—అవును. చచ్చినశవముత్రోళ్ళే!- కాని నీవాదాతను మెచ్చు కొనకున్నావేమి? అంతపైసా యిచ్చినవా డామాత్రపు పని చేయింప దనుకొంటివా?

పగ—దాతయైనవా డూరకే యిచ్చినగదా- గొప్పతనము! కూలీ యిచ్చినాడన్నమాట.

జంబూ—కూలీ రెండువేలిచ్చదరా!

పగ—వెధవడబ్బు—డబ్బు మనలగణించెనా? డబ్బును మనముగణిం చితిమా! ఇదిగో!—ఇదేమో కనబడుచున్నదా!

జంబూ—(తెల్లపోయి) ఏమిటిది?-వేయిరూపాయల కాగితము. నేను లేచి నక్క నేమాత్రమో త్రొక్కితిని. అయినా యిది నాకెం దులకయ్యా! వద్దు-వద్దు. (చేయిసాచును)

పగ—(చేతిలోఁబెట్టి) తీసికో- తీసికో- తాతా! దానమనగా నేమో తెలిసినదా!—యిప్పుడు—పనిచేయించు కొనకుండ యిచ్చి నది దానము. ఇప్పుడు సావకాశముగ మాటలాడుదము.

జంబూ—సెబాసురాబాబూ! మంచిదాతవు నీవు. ఛీ! ఛీ! మురుగు కంపుగొట్టు త్రోళ్లు కుట్టునప్పటికి నాముక్కులు బ్రద్దలయిపోయి నవి. వాని ద్రోక దానమేనా!

పగ—ఎవడుతాతా! వాడు?—

జంబూ—వానిపేరు నాకు జ్ఞాపకములేదోయి నాయనా!—ఆచతురకు వాని కేదోయున్నదని నానమ్మకము.

పగ—ఆచతుర యెవ్వరు?—

జంబూ—వారియింటనున్న యెర్రిటిపిల్ల—పొట్టిపిల్ల—గట్టిపిల్ల—

పగ—వారియిల్లు చూపెదవా?—

జంబూ—చూపెదనుకాని, ఆచతుర నాకండ్లకు గంతలుగట్టి తీసికొని పోయినది. నీవు అట్లే తీసికొనిపోయితివా చూపెదను.

పగ—(కండ్లకు గంతలుకట్టగా జంబూకుడు నడుచుచున్నాడు.)

జంబూ—ఆ- ఇక నిక్కడ నిలుపుము. ఇదే యిల్లు.

పగ—(గంతలు విప్పును.)

జంబూ—ఇక నేను వెళ్ళెదను. (నిష్క్రమించును.)

పగ—ఇప్పటికిల్లు కనుగొంటిని. కానిమ్ము. వీనిని హతమార్చి-మాదొర చే బహుమతి నందకుందునా?- ఈయింటి కొకగుర్తు వేసికొని— చని—మాదొరయగు మైరావణునితో చెప్పెదను.

(ద్వారమునకు + గుర్తు వేసి చనుచున్నాడు.)

[చతుర ప్రవేశము.]

చతు—ఎవ్వడో యొక్కటక్కరివచ్చి యీకవాటంబులపై గుర్తుల నిడి చనినవాడు. సందేహములేక నిది యాపందలపనియేకాని వేఱు కాదు. అన్నన్నా! ఎంతమోసము. ఇంకను మమ్ము వెంటాడిం చుచునే యుండిరి గావలయు. ఇక జాగరూకతతో నుండకున్న నెంతేని వంతగలుగకపోదు. ఈహంతకులు మాపైనింతపంతము

బూనియుందురే!—కానిమ్ము. ఈచతురకడ వీరిచాతుర్యంబు చెల్లునే ?—మచ్చుమందులు చల్లి యచ్చిక బుచ్చిక తనంబు నెరపి—పచ్చిపుదొంగతనంబుసేయు చచ్చువాగమ్ములగు సీతచ్చవకాండ్రు నేనలంటి తను వలలంజిక్కుదువని తలంచిరి గావలయు—ఈవార్త సత్వరంబుగ వామనోహరుఁడగు సదృష్టగుప్తున కెఱింగింతునా !—ఏల? తొందరపడనేల? అంతవఱకు వచ్చినఁ జూచుకొందము. ఇప్పటికి దీనికిఁ బ్రతిక్రియ చేసిన జాలును. వీను మాయిల్లు గుర్తింపకుండ నీవీధిలోని గృహంబులకెల్ల నిటులే గుర్తులనిడి చనియెదఁగాక! ఆవల వీరలే చతురసాహసంబు చవిజూతురు. ఎప్పుడోయొకనాఁ డీతులువలెల్ల నాకటారికి గుఱికాకుందురా ! ఆతవఱకు వచ్చిన దంతవఱకు రాకుండునా !—చూచెదనుగాక—తొందరయేల?—

(అన్నియిండ్లకు + గుర్తులు వేసి నిష్క్రమించును.)

(తరువాత మైరావణుని గొని, పగటిముచ్చు వచ్చి పలుగుర్తులు గని మోసపోవును. ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.





ఆలీబాబా

అను

# అదృష్టవిజయము

## షష్ఠాంకము.

### 1 వ రంగము:—మైరావణుని గుహ.

మైరా—పరిచరులారా! ఆమ్రుచ్చును బట్టియిచ్చెదనని నన్ను వంచించిన యామ్రుచ్చునుబట్టి యఱదీయుఁడు. చండశాసనుఁడగు మైరావణుని కార్యమన్న పిన్నాట యనుకొంటిరా?- రోషంబున రగిలి పొగులు నామనంబునఁ గోపంబు మితిమీఱనిచ్చినవారి నెల్లే సంహరించెదనని నమ్ముఁడు. చుఱుకు కరవాలమ్మున కెఱుక్కవఁ దెగనఱికెద. మీకు శక్తియున్న వచ్చి ముందు నిలువుఁడు. వ్యర్థులరైతిరేని మిన్నకుండుఁడు. నిరర్థకపరితాపంబులు పల్కి-ప్రాణాబులపైకిఁ దెచ్చుకొనకుఁడు. మీరందఱు వ్యర్థులరైతిరేని-నేనొక్కఁడనే నాపాపాత్ముం బరిమార్చెదను. తైలవ్యాపార వేషంబున నే నాపిల్లముని గృహంబునఁ జొచ్చి నమ్మకంబున నడురేయి వానికంఠ ముత్తరించెద. నలుబది నూనెబుంగలను జాగ్రత్తపఱచి యందు మీరు గుప్తముగ దాగియుండుఁడు. నేను సౌజ్ఞనొనర్పఁగానె వాలుగా బయలుదేఱి వానిగృహం

బెల్ల పీనుగపెంటలుగాఁ జేసి పగ దీర్చుకొందము. ఇందు మీ
రక్షిద్ధఁ జూపుదురేని మీ ప్రాణంబులు మీవికావని యెఱుం
గుఁడు. వానికి నేఁడు కాలమాసన్నమయ్యె- కానిచో, పెద్దపులి
మీసంబులతో నుయ్యాలలూఁగఁదలంప వానికెంతసాహసము?
కాలాహినికడ కాలఁదన్నిన మందుడు ప్రాణానిలంబులు నిలచు
ననియే తలంచెగా!—ఇదే దారుణంబుగ నీమైరావణ సింహంబు
బయలుదేఱె—ఇఁక నామార్గము నిష్కంటకంబు గావలయు!
లేదేని నేఁజావవలయు!—రెండే మార్గములు.

సీ. కాంతుగా? భయదనిర్ఘాతాహతంబునఁ
బ్రాణముల్ నిలుపు పాత్ముఁ డెవఁడొ?
చూతుగా? సింగంబుమూతిమీస
ముల నుయ్యాలలూఁగఁదలంచుకూళ యెవఁడొ?
కందుగా? శమనుని కాలదండముతోడ
సయ్యాటలాడు నాజాల్ముఁ డెవఁడొ?
పొడగాంతుగా? లోకలవియదావాగ్నుల
నరచేత నిడనెంచు నధముఁ డెవఁడొ?
మహిని త్రిపురారి ముక్కంటి మంటనంట
గాదలంచిన యధముని గాంతునెవఁడొ "
జగతి మైరావణుని గర్భశత్రు వైన
ఖలుని మరణంబుఁ గాంతు నాకన్నులార !!

చ. లయమయినన్ సరే- నిజకులంబు వినాశము నందినన్ సరే-
రయమున శత్రువర్గము-భరంబున పైకొనివచ్చినన్ సరే-
జయజయనాదము ల్సలిపి సన్నుతిమీరలు సేయుచుండ నీ
భయదకరాళఖడ్గమునఁ బట్టి వధించెద వాని శీర్షమున్.

రే!- ఖగిటిచుక్కా! నీకాయుర్దాయము చెల్లిపోయినది. రే!-

శేచుక్కా! శే!— మారీచా! మీరిరువురు వీనికంతము నుత్తరింపుఁడు. ఈవ్యర్థుండు మన వైరిగృహంబుఁ జూపింతు నని, నన్నుఁ గొనిపోయి—తానిడిన, శ్వేతచిహ్నంబులు పలు గృహంబుల నుండుటఁ దత్తరపడి, నన్ను నయితము నిరర్థకుని గావించె—ఇఁక వీని క్షమించుటకల్ల—వీని యమపురికంపి నన్ను వేగముగఁ గలయురండు; పోండు. మిగతపరివారము లనంతరకర్తవ్యముం బరికింప నరుగుదము. నాతోరండు

[అనుబంధము. 8]

(నిష్క్రమింతురు.)



2 వ రంగము.

అదృష్టగుప్తునియిల్లు.

[చతుర, అదృష్టగుప్తుఁడు ప్రవేశింతురు.]

చతు—చూచితిరా దేశ మెట్లుమాఱినదో!

సీ. బహుధనార్జక మైనబ్యారిష్టరీపని
వైన తృణంబుగా నవలఁ ద్రోసి
దీపితామూల్యవిదేశవస్త్రంబుల
వందఱాదిగ భస్మమందఁ జేసి
కులకాంతల శరీరముల నున్నమణిభూష
లను స్వరాజ్యనిధి కర్పణముఁ జేసి
హోదాలు బిరుదుల కుద్యోగములకు శా
శ్వతరీతిగా జలాంజలి యొసంగి,
స్వార్థమును రోసి సకలసౌఖ్యములు బాసి
సరిగ మోకాలు దిగని వస్త్రంబు గట్టి

చలికి నెండకు జంకక శాంతమూర్తు
లై ప్రచారకు లైరి మహాత్ము లిపుడు.

అద్రి—ఇప్పుడే యనుమాటయేమి? మనభారతీయులకు దేశభక్తి
యెంతప్రియమైనదో రాజభక్తియు నట్టిదే. వెనుకటి యైరోపా
మహాసంగ్రామమునందు—

సీ. రాజాధిరాజు లరాతిభంజనబాహు
బలచమూనివహంబుఁ బంపినారు
ధనశాలురగువా రుదారభావమున, శా
శ్వతయుద్ధనిధుల నొసంగినారు
బీదలు చెంబుతపేలాలఁ దెగనమ్మి
యుద్ధఋణంబుల నొసఁగినారు
చంటివారైన, వాలెంటరీపనులకై
గురుభక్తిఁ దమయంత నరిగినారు
భారతీయు లంచితరాజభక్తిచేత
చేతనైనంతసాయంబుఁ జేసినారు
తమకు విజయము హైందవోత్తములకతనఁ
గలిగె నని యాంగిలేయులే పలికినారు.

చతు—ఏమిలాభము? "ఏరుదాఁటి తెప్పఁదగుల వేసి"న చందమున,
నీవిశ్వాసమేకదా యిప్పుడు మఱువఁబడినది!

అద్రి—ఏదిమఱువఁబడిననేమి? ఉద్యమము యుక్తరీతిసాగినచో ఫలి
తము చక్కగనే పరిణమించును.

చతు—కాంగ్రెసుసభలవలన కావలసినంత యట్టహాసమేగాని, ఫలిత
మేమైనఁ గలుగుచున్నదియా?

అద్రి—మనవారిస్వలాభపరాయణత నశించిననాఁడు ఫలితమునకేమి?
అదిగాక దేశమున దుర్భిక్షమున్నపుడు, ప్రజలు బలవంతముగ

హానిసలుగా కేమగుదురు? కడుపుగాలుచున్నపుడు స్వార్థభావ మెట్లుచావఁగలదు?

చతు—పూర్వ మింతకన్న పంటలు విశేషమైయున్నవా? అప్పుడులేని దుర్భిక్షమున కిప్పు డేమికారణము?

అదృ—వెఱ్ఱిదానా! అదిగాదు కారణము? పంట లిప్పుడును పండుచునే యున్నవి కాని—

సీ. మనధాన్యమును దూరమున కీడ్చుకొనిపోవఁ
గా "రయి" శ్శ్రమరినకారణమున
క్షణములోపల ధాన్యమును బియ్యముగమార్చి
యందించు "ఫ్యాక్టరీ" లమరుకతన
పిలచిధాన్యమును దంపించువారలు లేక
కూలీలవృత్తులు గూలుచుంట
ప్రతిదినంబును నెగుమతులచే మనదేశ
మందు ధాన్యాభావ మాటచేత
పండుధాన్యమెల్ల పరదేశములఁ జేర
ఘనదరిద్రితాంధకారపటలి
భరతరాజ్యమెల్ల బంధురమై క్రమ్మ
నునరె దాస్యదీప మొకటి మనకు.

చతు—ఇదియా కారణము! అట్లయిన నీఫ్యాక్టరీలు లేనిచో మనధాన్య మెచ్చటిదచ్చట కదలకుండనుండుటచేత దేశము ధాన్యసమృద్ధమై యుండుటయేగాక దంపుళ్ళకూలీలు దరిద్రమునం జిక్కకుం దురు గదా!

అదృ—ఇప్పుడు దేశమున వెలసిన ఫ్యాక్టరీలసంఖ్యకు మితియున్నదా? కుక్కగొడుగులవలె నూరికి నాలుగుబయలుదేరినవి. పెద్దపట్ట ణములందు లెక్కయే లేదు. ఒక్కదానికిని పూర్ణమైన లాభము

పూర్ణానుస్వారమే! ఒక్క సంవత్సరము పంటలు లేకున్న నీఫ్యాక్టరీలలో దీపముపెట్టుటకైన దిక్కుండదు—మన దేశమున నేఁడిచూచిన వేలము వెఱ్ఱియే. మనధనమును, బలమును నశించుటకు విదేశవ్యామోహమే పరిపూర్ణమైన కారణము!

సీ. పంచాయతీసభల్ పడకిమూలిన వౌట
కోర్టులు ధనమెల్లఁ గొల్లగొనియె
కాఫీహోటళ్ళపైఁ గాంక్ష మిక్కుటమౌట
నారోగ్యసౌభాగ్య మంతరించె
పలురకంబులధూమపానముల్ వెలయుట
విషపానమే మహాప్రీతియయ్యె
సెల్ఫుషేవింగులచేత నంచితము లౌ
మనమతాచారముల్ మంటఁబడియె
నాకృతులు హూణ పద్ధతిననుకరించె
విప్రులకుఁ గ్రిస్టియనులకు వేష భాష
లందు నడవడిని విభేద మెందు లేదు
హూణనాగరికము మీఱుచుంటచేత.

మనము దేశముం దలంచుకొని లోలోన విచారించుటతోడనే సరిపోవుచున్నది. ఆచరణము శూన్యమయ్యెను.

చతు—ఇప్పుడు మనప్రాణములనే మనము రక్షించుకొనుట కష్టముగనున్నది. మన మాచోరులపని తీర్చిన పిదపగదా దేనికైన నాలోచింపఁగలుగుట!

అదృ—అతివా! మనల నాముట్టికొడికన్ను లేమిచేయఁగలరు! నీవు వారి కేలభీతిల్లెదవు? అంతగా వారు మనపై కెత్తివచ్చిన రానిమ్ము. ఈక్షణమున వారిని రక్షకభటుల కప్పగింతుము.

చతు—ఆర్యా! అధనాపహర్తలు మనపై బహిరంగముగ నెత్తివత్తు

రని తలంచితిరా? గూఢమార్గంబునఁ గనులుగప్పి గంతలు గట్టి మనలఁ బలిమూర్పదలంచుచున్న యా మోసగాండ్రను గాసిలఁజేసినఁగాని నాప్రాణికూరటగలుగదు. సంశయావస్థలం దు భరతదేశోద్ధరణ మేమిచేయగలము? ఆనాఁడు మనక వాటకుల కుఁ దెలిగుఱ్ఱు నిడి చనినచోరుఁడు తనయజమానునితో మరల వచ్చి నామోసంబున కాయాసమంది, విఫలుండై చనుట మఱ చితిరే!—మరల నెప్పటికైనఁ బగఁబూనిన త్రొఁచుపామువలె నాపాపి తనకోపంబుఁ దీర్చికొని మనకు సంతాపము గూర్ప కపోఁడు.

[కరటకుఁడు ప్రవేశము.]

కర—దండాలు బాబూ!

అదృ—ఏమిరా యది?

కర—నూనె లమ్మే లబ్బీసాయెబాట స్వామీ! నలబై నూనెబుంగలు దెచ్చినాఁడు. మీసావుకారింట్లో వున్నాడాలనిలడుగుతున్నాఁడు తన్ని తగిలేద్దునా- రానిద్దునా? సెలవేంటి బాబూ!

అదృ—ఏమి!..........నూనె వ్యాపారముచేయు లబ్బీసాహేబా! చతురా! ఇదేమైయుండును.

చతు—ఎవ్వఁడో నీయన్నగారినాటి వర్తకుఁడైయుండును. అప్పుడనేకులు వచ్చుచుండెడివారు.

అదృ—సరే! నీవు లోనికరుగుము. కరటకా! వానిని రమ్మనుము.

కర—చిత్తం బాబూ!

(నిష్క్రమించును.)

చతు—(తనలో) ఇదేదియో మోసంబని నామనంబునకుఁ దోఁచు చున్నది. చాటుననుండి వీనివర్యల గనిపెట్టెదఁగాక!—(చాటున నుండును.)

[వర్తక వేషమున మైరావణుఁడు ప్రవేశము.]

మైరా—అయ్యా! నమస్కారము. మామిత్త్రుఁడు లోభగుప్తుఁ డెక్కడ?

అదృ—తమ రిం దాసీనులు గండు. అయ్యా! తమరు మాసోదరుని మిత్త్రులని వినుట కెంతయు నానందమయ్యె!

మైరా—తమ రాతనిసోదరులని తెలియుట నాకును మనోరథ మీడేరి నటుల మనం బలరెను. అయ్యా!- ఆతఁ డెక్కడ?

అదృ—తమ రిందువచ్చి చిరకాలమైనదని తలంతును.

చ. పురుషవరేణ్య యేమనెద? పూజ్యుఁడు నాయనుజుం డకాలమా
గురుతరవ్యాధిపీడనలకుం గుఱియై మరణంబు నందె నీ
సరి శోకమా సపూర్వమున సర్వసుహృజ్జనబంధుమండలిం
బరమవిషాదభావమునఁ బాల్పడఁజేసి దయావిహీనుఁడై.

మైరా—అకటకటా! ఎంత కష్టంబుకలిగెను. పూర్వము వ్యాపారార్థినై నే నీయూరువచ్చినప్పుడెల్ల నీసోదరుఁడు నన్ను దయఁజూచువాఁడు. అట్టిమహాత్ముఁడు మరణించెనా?- పాపము!

అదృ—అయ్యా! అయిన నేమి?-తమ కిప్పుడుమాత్రమేల శోకింత కల్గును. నాగృహంబు మీగృహంబుగా భావించి తమయిచ్ఛ వచ్చినన్నినాళ్ళు సుఖంబుగా నుండవచ్చును. తమవెంట నేదైనఁ దెచ్చియుంటిరా!

మైరా—నలుబది నూనెబుంగలమాత్రము.

అదృ—కరటకా! వీరివెంటవచ్చిన నూనెబుంగలను లోన జాగ్రత్తపఱుపుము.

మైరా—అక్కఱలేదు. అవి యతిజాగరూకతతోఁ దేఁదగినవి. నేనే తెచ్చుకొందును.

అదృ—తమ చిత్తము.

మైరా—(తనలో) ఇప్పటికి వీనియింటఁ బీఠము వేసితిని. ఆముత్రిచ్చు వీడేయనుటకు సంశయము లేదు. కానీ—ఈరేయి వీని తుద ముట్టింపకపోతినా- నాపేరు మైరావణుఁడు గాదు.

(ఇరువురు నిష్క్రమింతురు.)

3 వ రంగము.

నలుబది నూనెబుంగలు గల మందిరము.

[మైరావణుఁడు ప్రవేశించి.]

హా! దురాత్మా! వంటయింటి కుందేటివలె నాచేఁ జిక్కిన నీ వింకెందుఁ బోఁగలవురా?-తులువా—నాధనంబెల్ల సాధించి, నామనంబును వేధించిన నిన్ను కసితీర గసిమసంగెద. ప్రతాపశాలి యగుమైరావణుఁడు షండయని తలంచితివో ! నాగర్భశాత్రవుఁడవగు నిన్ను ఖండఖండము లొనర్చు గండరగండడనని యెఱుంగక మోసపోయితివి. జనియించినదాది యిప్పటివఱకొక్కనిచేఁ బరాభవింపఁబడని—పరాక్రమశాలినగు నేను నీ మోసంబులకు వేసరపోవుదునఁటరా!- ఖలమతీ ! మంద భాగ్యుఁడవగు నీ జీవితరేఖ నేఁటితో మాసిపోయినదని తలంపుము. (అటు నిటు జూచి) ఇంటియందేమియు నలికిడి లేదు. కాని యింకను సాహసింపఁగూడదు. గ్రామమున నింకను సంచలనముగా నున్నది. ఇప్పటికి వీరిని హెచ్చరించి చనియెద గాక!—రెండవయింటివాఁ డెఱుంగకుండ నీగృహ మీరేయి పీనుఁగుల పెంటలతో నిండునుగాక!—నాకన్నుల కానందముగా వీరి రక్తప్రవాహములు నేలపై మడుగులై నిండుగాక !

గీ. కనుల విఁఱుమిట్లు గొలుప రక్తప్రవాహ
పంకిలంబగు భూమి నీశరమనీచు

శిరము బహుళకలంబులై వ్రారలుచుండఁ
గనులఘంటలు చల్లాఁగాంచువాఁడ.

(మెల్లగా చప్పట్లు జఱచి) రే!- పరిచరులారా! జాగరూకులై యుం
టిరిగాదా- [బుంగలలో నుండి "స్వామీ" అనుధ్వని]

మైరా— హెచ్చరిక—మిగుల హెచ్చరిక—నేను మీబుంగలపై రాలు
రువ్వులేటే గుఱుతుగా నెఱింగి బయటకు వచ్చి నేను శాసించిన
ప్రికారము చేయువలయు. (బుంగలలో నుండి "చిత్తము"
అని ధ్వని)

మైగా—ఇప్పుడు పదునొకండుగంటల రాత్రి యయినది. అదిగో! ఇంటి
లోని దీప మారిపోయినది. ఎవ్వరో లేచిన యలికిడియు నగు
చున్నది. నే నిచ్చటనుండ రాదు. సత్వరమరిగి నాశయ్యపైఁ జేర
దను. (నిష్క్రమించును.)

చతుర—(దీపపుబుడ్డితో ప్రివేశము.) "హేతువు లేక తీతువు కూయ
దనునట్లు" నేఁ డర్ధరాత్రిమున నింటిలోని దీప మారిపోవుట
చూడఁగా నా కాశ్చర్యము గల్గుచున్నది. (బుడ్డి నూపిజూచి)
యుందు తైలాభావమైనది. ఆ! మఱచితి. నేఁటి యుదయమున
నొకవర్తకుఁడు నూనెబుంగలతో మాయింటి కరుదెంచెఁగదా-
అందు కొంత తైలమును సంగ్రహించిన నేమిదోసముగల్గు. ఉద
యమున నెఱింగించెదగాక! (బుంగలకడ కరుగును) (బుంగలలో
నుండి "వేళయైనదా" అనుధ్వని)

చతుర—(ఆశ్చర్యముతో తనలో) ఏమిది! పరమాద్భుతముగా నున్న
ది. ఈ బుంగనుండి మనుష్యస్వరము వినఁబడుచున్నది. ఎంత
మోసము! అట్లయిన నిందున్నది తైలముకాదా! మానవులా!
ఈ తైలవర్తకుఁ డాదొంగల తేఁడే యైయుండును. సందియము
లేదు. ఓరీ! మోసాలమారీ!- ఇప్పుడు నాచేతఁజిక్కితి వికనీ

వెందుఁ బోఁగలవు రా? నీ తుదముట్టింపకమానను. కానిమ్ము. ఇప్పుడు దీనికిఁ దగిన ప్రతిక్రియ చేసెదఁగాక ! (తిరిగి "వేళ యైనదా" అను ధ్వని)

చతుర—(స్వరముమార్చి) మఱికొంత తడవు చనవలయును. హెచ్చరిక! హెచ్చరిక!- (స్వగతం) తక్కిన బుంగలలో తైలము గలదో లేక నలుబదియు దొంగలతో నిండిన బుంగలేయగునో తెలియవలయు. (రెండవబుంగకడ కరిగి) "హెచ్చరిక! హెచ్చరిక! మఱికొంతతడవు వేచియుండుడు" ('చిత్తము' అను ధ్వని) (ప్రతిబుంగకడ కరిగి "హెచ్చరిక!—అని చెప్పి) భళీ!— ఈ నలుబది మందిదొంగలును నాకరతలంబున జిక్కినడిరి. ఈ మాట నా యజమానున కెఱింగించి రక్షకభటుల కప్పగింతునా?—వలదు—వలదు. అట్లు గావించినచో మా యైశ్వర్యలాభరహస్యకథ యంతయు వెల్లడియై మే మిడుమలపాలగుదుము. ఉదయమగుదాక నిటులే యుంచి—యజమానుఁడు లేచిన తమపరి నెఱింగింతునా!—అటులుగావించిన నీరేయియే యీరాత్రించరు లెంతసాహసముఁ దలపెట్టియుండిరో!—పలుముప్పులకుఁ గారణంబైన యీ దొంగలగుంపు నొడిలోఁత్రొచుపాములవలె నింట మననీయవచ్చునా?- కానిమ్ము. సంశయింప నేల?- మా ప్రాణంబులను రక్షించుకొనుట కిప్పు డెంతటిసాహసంబైన గావింపవలసిన దే!— సాహసంబని జంకక—హత్యాకృత్యమని యనుమానింపక—పాపమని భయపడక—భీకరకరవాలసహాయమున నేనే యీ నలుబదిమందిదొంగల ప్రాణంబులఁ దీసెదను. ఇంతలో నిది మాయదృష్టగుప్తున కెఱింగింప నేల?—గాఢాంధకారబాధురయగు నీనిశారమణియే నాకు తోడగుగాక!—పరిక్రృతిగంభీ

రుఁడగు నీకాలపురుషుఁడే నాకు సహాయుఁడు కాఁగలఁడు. మానసమా!- ధైర్యము వహింపుము. సాహసమా!—నా యందు నిలచియుండుము. కరవాలమా!—చలింపకుము.

(అనుబంధము. 21)

(కరవాలమును దెచ్చి నలుబదిమంది దొంగలను పొడిచి చంపి నిష్క్రమించును.)

మైరా—(ప్రవేశించి) ఎవ్వరును మేల్కనియుండ లేదుగదా!—ఇదియే నాతలంచిన ఘోరకార్యాచరణంబునకుఁ దగిన సమయము. నాపరివారము నిఁక మేలుకొలిపెదను. (ఒక్కొక్క బుంగపై రాలురువ్వగా ప్రత్యుత్తరము రాకుండుటఁగాంచి) ఛీ-ఛీ-మందమతులారా! మైమఱచి నిద్రించుచుంటిరా! పశుప్రాయులారా! ఈపెద్దనిద్దుర మీ కేలగలిగెను. మీలో నొక్కరికైన మెలకువ రాదా!—జ్ఞానహీనులగు మిమ్ము మన్నింపను. (మరల రాళ్ళు విసరి ఆశ్చర్యముతో) ఏమిది? ఏదేని మోసము సంభవించి యుండునా! బుంగలలో నుత్కృష్టగతినున్న పీరల కింత వేగిర మెట్లు మఱిదప్పెను? తప్పిన అందఱొకమారు తప్పుట సంభవము కాదుగదా!- ఇది పరమాశ్చర్యకరమైన విషయమే!—ఆశ్చర్యమన నేల? తప్పక నిందేదియో మోసము జరిగియుండునే కాని వేఱుగాదు. ఈనాపరిచరు లేగతినుండిరో పరికించెదగాక! (దగ్గఱకేగి చూచి మృతినందుట గ్రహించి) హా! హా! ఏమివిపరీతము! మహాకష్టంబు జరిగిపోయినది. హత్యయే జరిగినది నలుబదిమందియు నిటులే గావింపఁబడి యుందురా!—(చూచి) హా! నాప్రయత్నమంతయు భంగమైనది. నాయనుచరులందఱు హతమయిరి. నాగుట్టు బట్టబయలైనది. జననమాది స్వప్నమందైన భీతియెఱుఁగని నాహృదయ మీదారుణవధలం గాంచి

తల్లడిల్లుచున్నది? ఏమిసేయుదును. ఛీ- ఏమిచేయుదునని విచారింపనేల? నాహృదయంబునకు భీతిసయితము గలుగఁగలదా! నావ్యూహంబులకుఁ బ్రతివ్యూహంబులంబన్ని-నాతెక్కలు తెగనఱకి—నాకంఠము నురిత్రాటిచేబిగియులాగిన యాకల్మషుని నేల రాచుదనుక నిదురింతునే?— రే! పాపీ!చండాలా! ఎంతపని జేసితివిరా! తులువా! నాగొంతుకను తెగని మొండికత్తిచే గోసితివటరా!- ఇక నీమరణము దాపురించె నిలువుము. అధిక పరితాపరోషాగ్నులచే దందహ్యమానమగు నాశరీరమునకు నీరక్తచందన లేపంబునగాని శాంతికలుగదురా దుర్మదాంధా! ఎట్టిబెట్టిదంపు కష్టంబులు నాకు గలుగనున్నను నిన్ను మట్టుబెట్టి నాప్రాణంబులు బాసెద.

(పోబోవగా)

చతుర—(కత్తితో ప్రవేశించి) రే! దొంగలరేడా! నిలునిలు నీమరణము దాపురించినదిలే! ఇక నెందుబోగలవు?

మైరా—ఓహో! కడుమోసముకలిగెను- ఇప్పుడు నేనిందుండక పారిపోవుటయే ప్రాణరక్షణమునకు మార్గము. (పారిపోగా కవాటము శిరమునకు దగిలి గాయమగును. మైరావణుడు పారిపోవును.)

చతు—సెబాస్. దొంగలరేడా! ఇఁక నీవెంతదూరము పారిపోయినను నన్ను తప్పించుకొనజాలవు. నీఫాలమునందున్న గాయమే నిన్ను పట్టియీయఁగలదు. (అటునిటు జూచి) అప్పుడే తెల్లవాఱ వచ్చుచున్నది. రక్షకభటులవలన నేభీతియు గలుగకమున్నే- యీశవములను విముక్తిగాంచుమార్గ మారయవలయును. ఈ వార్త మాయజమానునితో చెప్పెదను.

(చతుర నిష్క్రమించును.)

[చతుర అదృష్టగుప్తునితో ప్రవేశము]

అదృ——బిత్తరీ! ఏటికి నీ కీతత్తరపాటు ?

చతు——స్వామీ! తత్తరపాటేమత్తకాసినిమొదల రిత్తయని నీచిత్తమున నమ్మము. నీకుత్తుక తెగనరుక నెంచిన కత్తెరగానిని నాకత్తికి గుత్తగావింప నాయత్తపడితిని గాని యింతలో నాతొత్తుకొడుకీమొత్త నావలబడి మెత్తమెత్తగ బరువెత్తె-

అదృ——ఆ- ఆ- ఎవఁడాదురాత్ముఁడు? ఎక్కడనున్నాఁడు.

చతు——స్వామీ! తమరెరుంగకుండ నే నీరేయి గావించిన యీసాహసంబునకు నన్ను మన్నింపవలయును.

గీ. ప్రకటముగ నేఁడు నూనెవర్తకుఁడ నంచు
వచ్చినట్టి తుచ్ఛుండె నీవైరిసుమ్ము
దారుణంబైన మత్ఖడ్గఘాటికోడి
విఫలమానసుఁడయి పరువెత్తినాఁడు. (కత్తిచూపును)

అదృ——ఆ- ఆ- చతురా! ఆకత్తియేమి? ఆరక్తమేమి?

చతు——ఆమహోత్సవమును కన్నులార జూచెదరుగాని రండు.

(బుంగలకడకు గొనిపోవును.)

అదృ——ఇవియేమి? ఆచోరుడు తెచ్చిన బుంగలుకావా !

చతు——బుంగలో- బుంగలలోదాగిన దొంగలో !- చూడుఁడు.

అదృ——దొంగలా ! చతురా ! ఏన్గులంతటిమనుజు లీబుంగలలో నెట్లు దూరిరి.

చతు——నాచే పీన్గలగుటకు దూరిరని తోచుచున్నది.

అదృ——ఆ- నీవువారిని చంపితివా యేమి ?

చతు——క్షమింపవలయును. ఆచోరులు నేటిరేయి చావక బ్రతికి యున్నచో మనము తెల్లవారునప్పటికి బ్రదికియుండక చచ్చియుందుము.

అదృ—ఇదియంతయు నా కమితాశ్చర్యముగా నున్నది ఏమిజరిగినదో విపులముగా నెరింగింపుము. నామనంబు తత్తరపడుచున్నది.

చతు—తొలుత నీశవములు నలుబదియు మనయింటినుండి తరలు మార్గము చూడుము. వృత్తాంతము సావకాశముగ నెరింగించెదను. ఈరేయి మీప్రాణములు మృత్యులోక ముఖద్వారము వరకరిగి తిరిగి వచ్చినవనిమాత్ర మెరుంగుడు.

అదృ—చతురా! నాకొరకెంత సాహసము నొనరించితివి. నాప్రాణములను రక్షించిన నీకు నాశరీరము నర్పించుటకన్న మరుమేలు వేరేదియు గావింపలేను. ఏదీ!- ఇంతటి వీరకృత్యమునల్పిన నీవు నెత్తురుచేతులతో నుండగనే యొకముద్దిమ్ము.

చతు—తప్పు- తప్పు- ఇది సమయముకాదు.

అదృ—ఈయానందమున నాకు తప్పొప్పులు తెలియవు. బలవంతముగనైన నిన్ను ముద్దుకొనకమానను. (ముద్దుకొనును.)

(ఇరువురు నిష్క్రమింతురు.)

4 వ రంగము:—వీధి.

[కరటకు డొంటరిగ ప్రవేశము.]

కర—అబ్బబ్బ! ఆపదికాదురా యీచతుర !- నలుబదిమంది దొంగల నొక్కరాత్రిలో చంపిన దీనినిజూచిన నాగుండెలు దడదడ గొట్టుకొనుచున్నవి. మాయజమానుడు- అదృష్టగుప్తుడు రహస్యముగ నన్నుబిలిచి "కరటకా ! ఎంతధన వ్యయమైననరే !- ఈశవముల నీయింటినుండి వదలింపవలయు"నని నాకాజ్ఞాపించినాడు. నాయొక్కని కీకార్య మసాధ్యముగ నున్నది ఏసాధనముం బరికింపవలయునో నాకు పాలుపోకుండనున్నది. అప్పుడే దిశల తెలతెల బారుచున్నది. అదిగో ఆవచ్చువా డెవ్వడో మా దమనకునివలె నున్నాడే! ఎన్నాళ్ళకు వచ్చుచున్నాడు.

[దమనకుఁడు ప్రవేశము.]

దమ—తినుచున్న కూటిలో మన్ను బోసికొని ఆవల నేమిగాకలదని యా సించి వరువెత్తినవాం డ్రిందఅగతి యిదే! ఏమొగము బెట్టుకొని మరల నదృష్టగుప్తుని మొగము జూడగలను ? (ముందుచూచి) అదిగో!- మాకరటకుడు పొద్దునే యటునిటు దిరుగుచున్నాడు. కరటకా ! కరటకా !!

కర—ఓరీ! దమనకా! ఎన్నాళ్ళకు వచ్చితివిరా! అచ్చువేసిన ఆఁబోతు వలె- తిరిగితిరిగి- కొంపజేరితివా ?

దమ—ఓరీ కరటకా! ఇల్లు వదలినతరువాత- ఏమిచెప్పుదునురా- నా అవస్థ- చెప్పుకొనుటకు సిగ్గగుచున్నది.

కర—ఏయవస్థలు పడితివి?- ఏమిజరిగినది?—

దమ—ఇప్పుడవి చెప్పుట కవకాశములేదు. ముందీమాట చెప్పు. నేను చెంపలువాయించుకొని రెండుకాళ్ళు పట్టుకొన్నచో నన్నదృష్ట గుప్తుడు క్షమించునా?

కర—ఇప్పుడు నీవు చెప్పినను వినుటకు నావకాశములేదులే ! నీవు పిట్టకల్లు మానినచో క్షమించునురా ! అదృష్టగుప్తునిదగ్గర జేరినతరువాత నాగొంతుతడి అభ్యాసము పోయినది.

దమ—పోనీ- బాబూ- నీతోపాటు నేనుకూడ మానెదను. నీకాళ్ళు పట్టుకొందును. నన్నేలాగునైన అదృష్టగుప్తునివద్ద జేర్చి పుణ్యము గట్టుకొమ్ము.

కర—చపలచిత్తపుముండకొడుకవుగదా! నిన్ను నమ్ముటెట్లు?

దమ—తిన్నగా సాగినంతవఱకే చపలచిత్తముగాని-కూడు లేనప్పు డేమి చపలచిత్తమురా !

కర—కూడువచ్చినతరువాత మరల చపలచిత్తము తిరుగునేమో నిన్నెవరు నమ్మగలరు.

దమ—ఇంతయనుభవమైన నింక చపలచిత్తమా!

కర—అట్లయిన చెంపలు పళపళ వాయించుకో!

దమ—బాబూ! బుద్ధి గడ్డితిన్నది. (చెంపలు వాయించుకొనును.)

కర—(తనలో) శవములను పూడ్చిపెట్టుపనిలో వీనిసహాయముగొని వీనిపై నదృష్టగుప్తునకు దయగలిగించెదను. ఎంతసొమ్మయినను వెచ్చింపదలచినాడు గనుక మాకదృష్టగుప్తు డీపనిలో నేమైన ముట్టజెప్పకపోడు. (ప్రకాశముగ) సరే! నీవు వకపనిచేసితివా! దాని కదృష్టగుప్తు డమితానందమునంది నిన్నుదయతోఁజూచును.

దమ—నీవు చెప్పినట్లుచేయుదును—ఏమిపనియది?

కర—అతిరహస్యమగుపని. వెల్లడిచేసిన నీప్రాణములు పోవును.

దమ—నన్నెరుగవటరా! కరటకా!

కర—సరే! రమ్ము చెప్పెదను. (ఇరువురు నిష్క్రమింతురు.)



5 వ రంగము.

మైరావణుని గుహ.

మైరా—అకటకటా! కళావిహీనమై నిర్మానుష్యమైయున్న యీగుహాతలమును జూచిన నాగుండెలు బ్రద్దలగుచున్నవి. జీవకళలతోఁడ నిరంతరము ధనలక్ష్మి కాస్థానపీఠమై కలకలలాడుచుండు నా గుహాతలము నేఁడీరీతి నిర్జీవమై యొప్పంగుటఁ జూచియు మొండితనమున నాప్రాణము లీశరీరమును వదలిపోకున్నవిగదా! నలుబది మంది పరిచరులు గొలువ గ్రహసమూహమధ్యంబున వెలుగు మార్తాండునిగతి నిం దమిందానందమునఁ జరించు నేను నేఁడిటు లేకాకినై రావలసెఁ గదా!—కటకటా! కాలమహిమ! ధన లక్ష్మి! నీవుచంచలవగుట నిప్పుడుగదా స్వానుభవంబునఁ దెలసి కొంటిని.

సీ. పంచకల్యాణిపైఁ బరగెడు నామోలఁ
జేరెడు సరదార్లు లేరు నేఁడు
యీలవేయఁగ నా కీవలావల నిల్చు
శూరమండలి గానరారు నేఁడు
సంచులకొలఁది యైశ్వర్యంబు గలగల
లాడింప నొకఁడైన లేఁడు నేఁడు
కనుదోయి మిఱుమిట్లుగొల్పఁ జూపట్టునా
రజితాచలము గానరాదు నేఁడు
భయదమై రావణుని కీర్తి బాసె నేఁడు
అవనితలమెల్లఁ దలక్రిందు లయ్యె నేఁడు
విలయసమయంబు భువి నుద్భవిల్లె నేఁడు
కడకు పాతాళగుహ పాడుబడియె నేఁడు.

ఈమహిమండలం బెల్ల సైరావణుండని పలికినంత గడగడాయమానం బగునట్లు చరించిన నేను—నేటికొక్క మానవాధమునకై మానంబుబాసి, దీనుండనై ప్రాణభంగంబున కోర్తునే! ప్రాణంబులువీడిన వీడుగాక! కడసారి నాకంఠంబునుండి ప్రాణవాయువు లుండుదనుక నాప్రతాపంబున కనుతాపంబు రానిత్తునే!—అకుటిలకర్ములనల్లర నాకూరకరవాలంబున కాహారంబు జేయుదనుక నామనంబూరటనందుట లేదు. ప్రాణంబులు స్థితల్లడపాటునందుచున్నవి. అకటా! ఎట్లుభరింతు? ఈకన్నులతో నీవినాశగుహాతలముఁగవిభరించుటకన్న-నీకటారితోఁ బొడుచుకొని భూమి కొరగుటయేమేలు. (ఆలోచించి) ఛీ! పౌరుషంబువిసర్జించి ప్రాణహత్యకియ్యకొందువా? వలదు. ఆతులువలకు నాదోర్దర్పంబు చవిజూపించివారితోఁగలసియేపరలోకంబునకరిగెదగాక! పరలోకంబుననైన నావిరోధులైన యా పాపులహృదయాంతరంబులు

శాంతంబుగనుండనిచ్చెదవా? ఆ నాఁడు నేను, నాపరిచరులమరణం
బునకు పరితాపంబునందుచుఁ బరిమార్చిన దురితాత్ము నఱఁదను
కించునంతలో నొకపిశాచిని నా వెనువెంట నంటివచ్చె. అప్పుడు
నాయీఫాలతలంబు కవాటంబునకుఁ దటాలునఁ దగులుటచే
నిల్లు కలాయితుండఁ గావఁసివచ్చెఁగదా! తెలతెలవాఱు నాఁకను
వెలుతురులో నాఁకులట నన్ను గుర్తించియుండునా? గుఱుతించిన
నేమి? పలు వేసంబులఁ బరుల కెరుక రాకుండ సంచరింప నేర్చిన నే
నొకరికిఁ జిక్కుదునా? చిక్కినవారి నుక్కడంపకదక్కువాఁడనా!
పరమపిశాచస్వరూపిణియగు నా రాకుసియే నాపరిచరులం బరి
మార్చియుండును. దానిపసదూల్చు టీమైరావణున కొక లెక్క
గాదు. (కొంచెమాఁగి) అహో! యేమిది? నాకు దుర్నిమిత్తంబు
లనేకంబులగుచున్నవి. అయినను వీనికి నావంటివాఁడు లెక్క
సేయఁగూడదు. అకటకటా! మన స్సెంతసరిపుచ్చుకొందమన్నను
నా కూరటగలుగదే! -గర్భాంతరాళమునుండి పొంగిపొరలివచ్చు
నీదుఃఖాగ్నిని జల్లార్ప నావిరోధుల వేడినెత్తురు దక్క వేఱుమా
ర్గము లేదు. పరిపంధిగర్వనిర్వాపణధూర్వహా మగునోకర
వాలమా! నీకుఁ బరాకు. చిరకాల మన్నివాసితమగు నోపాతాళ
గుహాంతరాళమా! నాకు నీఋణము దీఱిపోయినది. పొరలివచ్చు
దుఃఖము నణంచుకొని కన్నులగారు బాష్పంబులను రెప్పలనప్ప
గించి నీకడ సెలవుపుచ్చుకొనుచున్నాను. శత్రువులం బరిమార్చి
యాత్మహత్య గావించుకొనను న్యూర్తుఁడై యున్న యీమైరావణుఁ
డిఁక నిన్నుఁగనఁజాలఁడు. నీకిదే జోహారు. ఓయరణ్యమా! నాకు
సెలవు.

(నిష్క్రమించును.)



## 6 వ రంగము.

### అదృష్టగుప్తుని యిల్లు.

[ప్రమద, చతుర ప్రవేశింతురు.]

ప్రమ—చతురా! నిన్నటిదినమంతయు నేకాదశి; యుపవసించియుం టిని. పెందలకడ వంట కావలయును. నీవు గిల్లుకొనినదే గిల్లుకొనుచు పొద్దెక్కించిన వీలుపడదు. తెలిసినదా! అదృష్టగుప్తుఁడు నిన్ను వెనుక వేసికొనెరా నీ! నేను వెళ్ళుచున్నానుగాను. మది నుంచుకొమ్ము.

చతు—అమ్మా! ఒక్కనిముసమున వంట జేసిరానా! అదెంతపని?
(నిష్క్రమించును.)

ప్రమ—కరటకా!

కర—(ప్రవేశించి) పంకా లాగుతుండానమ్మా!

ప్రమ—ఓహో! ఈశీతకాలమున మీచతురా రాణిగారికి పంకాలు గావలసివచ్చినవి కాఁ బోలు నేమి?

కర—చతురమ్మగారికి గాదమ్మా! బాబుగారికి.

ప్రమ—సరే! ఎవరికైనా నాకేల? ఐశ్వర్యవంతుల కెన్నిసుఖములైనఁ గావలయును. మగఁడుచచ్చి-విధవనై-విరాగినై సుఖమునకు నోచుకొనని నిర్భాగ్యురాలను నాకు వారి ప్రస్తావనమేల? నిన్న టిదినమంతయు నేకాదశి యుపవసించియుంటిని. నేఁడు శీఘ్రముగ నతిథిపూజ చేసికొని పారణ చేయవలయు. పంకాతాటి నటులో కమూలఁబడ వేసి-బయట గుమ్మమువద్దఁ గూర్చుండుము. ఎవరైన సాధులు, యోగులు వచ్చిరేని-మనయింటికి సగౌరవముగఁ గొని రమ్ము.

కర—పంకాతాడొగ్గేస్తే బాబు సుక్క లిరగ మొసుస్తాడేమో.

ప్రియ—ఏమీా! తనవలపులాడియగు చతురకొఱకు గులాబిపూలదండ లు తెచ్చిన నేమియుననని మీాయయ్య నాకొఱకు వ్యయపఱచిన యొక్కనిముసమునకు నీమక్కలు విఱుగఁబొడుచునా?-అవును. నాభర్త తన్ను చిన్ననాటనుండియుఁ బోషించిన విశ్వాసము నకు మీాయయ్య యిట్లనడామటే! ఎంతకాలమునుండియో నా పిడికిటిగ్రుద్దులకు వెన్నొగ్గిన పిఱికిపందవు! నేఁటికి నేను నీకంటికి బానిసగఁ గనుపడితిని. అదృష్టగుప్తుఁడును చతురయు నీకు యజ మానులైరి. ఆహా! విశ్వాసదేవత మొత్తగుడ్డిదైపోయినది. ఐశ్వర్యమద మెంతపసిచేయదు?

కర—(తనలో) నడుమ నాకు సావొచ్చిందిరాబాబూ!

[తెరలో అదృష్టగుప్తుఁడు.]

కరటకా! వదినెగారి యిష్టప్రకార మొనరింపుము. ఎప్పుడు వారియానతి దాఁటవలదు. నీ కిదే నాయాజ్ఞ.

కర—చిత్తంబాబూ! (తనలో అయ్యకాడ నేలమీాద తొంగున్నా వొకటే అమ్మకాడ కిందతొంగున్నావొకటే!)

ప్రియ—కరటకా! ద్వారముననుండుము. నీయయ్యగారి యాజ్ఞయైనది గాదా! సంతుష్టిపడితివా!

(నిష్క్రమించును)

కర—(ద్వారముననుండును.)

[మైరావణుఁడు యోగివేషమున ప్రవేశము]

మైరా—(తనలో) అకటా! కాలమహిమ—

గీ. తరణికిరణకాంతి ధగధగ లాడెడు
కవచ మేగి, కలిగె కావిగుడ్డ
శత్రువీరకంఠ శతధావిదారిత
చండఖడ్గ మేగి, దండ మమరె.

కానిమ్ము. వైరప్రతీకారమున కెట్టిసెచ వేషముఁ దాల్చినను దోషము గాదు. నావైరి ప్రాణంబులఁ దీసికదా శాంతింపవలయు! ఈఖడ్గ మును గుప్తముగా నుంచుకొందును. ఈరాత్రి వీనిఁ యంతము గాంతును. నాఁడు నాపరివారమును బరిమార్చి—నన్ను వెలి పించిన పిశాచినిం దొలుతఁ దూలించి పిదప నావిరోధిని వధిం చెద. అంతదనుక కపటంబున నటించి నావేషంబు సమర్థించు కొందును.

కర—అదుగో! సన్నాసోడు రానేవొచ్చేసినాడు. మరేటి? పెమిదెమ్మ గారికాడి కొక్కపరుగునెళ్ళి సెప్పేస్తాను సామీ!

(నిష్క్రమించును)

మైరా—వీఁడెవ్వఁడో నన్నుఁజూచినతోడనే లోపలకరిగినాడు. కానిమ్ము. కరవాల మొకటి నాచేతనుండఁగా నెట్టికష్టముం గలుగదు.

[ప్రమదః కరటకుఁడు ప్రవేశము]

కర—ఇల్లిడిగో- వోళమ్మా! బైరేగినాకొడుకు.

ప్రమ—ఓరీ! పూజ్యుల నట్లు దూషించుట కడుదోషము.

కర—మంచిసెడ్డలెరిక నేని మోటుౘంజికొడుకుని. నాకుదోసమేటి. ఆఁ-

(నిష్క్రమించును)

ప్రమ—స్వామీ! తాము మహానుభావులట్లు తోఁచుచున్నారు. తమ దర్శనంబున నాకు బ్రహ్మానందము గలిగెను. మాగృహంబు పావనంబయ్యెను. నేఁడు ద్వాదశియగుట-పారణంబొనర్చి నన్ను ధన్యురాలినిగాఁ జేయ వేఁడెద.

మైరా—(తనలో) ఓహో! ఇది మాటలతవింతగానున్నది. కాని మ్మటులే సమ్మతింతును పదపడి విచారింతును. (ప్రకాశముగా) అమ్మా! మే మొకరియింట తడవు తడయువారము కాము. ఐనను నీవు కడు పూజ్యురాలివిగాఁ దోఁచుచున్నావు. అటులే వచ్చెదను.

చతు—(ప్ర॥మైరావణునిగుర్తించి) ఔరా! ఈమోసగాడు తిరిగివచ్చుల వంచింప నేగుదెంచెను. వీనిమొనట నున్నగాయమును గుఱుతింపవా? క్రూరత్వమున గ్రక్కుచున్న వీనిముఖచిహ్నములచే నీ వచ్చెవుడాంగ నెఱుంగఁజాలవా!-ఈసారిమాత్రి మీా ఛండాలుఁడు చతురబారినుండి తప్పించుకొనిపోవలేడు.

ప్రేమ—చతురా! ఈపూజ్యునిఁ జూచితివా! ఈయనకు నేఁడు మన యింట విందు సుమా!

చతు—అమ్మా! ఇది మొదటసారికాదు. ఈయన యిదివఱకొకమారు మహాకష్టమున గాందిశీకుఁడగుచుండఁ జూచినట్లు జ్ఞాపకము.

మైరా—(తనలో) ఆ!-ఏమి?-ఇది నన్ను గుర్తించెనా యేమి?

ప్రేమ—చతురా! పూజ్యుల నట్లు దూషించుట తప్పు. నీయభిప్రాయ మేమి?

చతు—ఏమియును లేదమ్మా! నేనే పొరబడియుండును అయ్యా! నేను తొందరపడినందులకు క్షమింపవలయును. రండు. మీాకు తగినట్లు గావింతురు.

మైరా—(తనలో) ఆనాటిజగిజంత యిదియే యని తోఁచుచున్నది.

ప్రేమ—ఊఁ- అయినను భయము లేదు. (అందఱు నిష్క్రమింతురు.)

## 7 వ రంగము.

### అదృష్టగుప్తుని మందిరము.

[మైరావణుఁడు ప్రవేశించును.]

మైరా—(ఆత్మగతమున) ఔరా! విధివిపరీతము! పాతాళగుహాయంత్రయుం బాదుపడి యీనికృష్టమందిరంబునం జేరెనా! (కలయఁ జూచి) నాకన్ను లీమందిరమును జూడఁజాలక, మిగుల సంక్షోభము గల్గుచున్నయది. ప్రళయకాల, కాలదండసమాన మగు

మదీయకరవాలము నిస్తేజమైపోయెనా? ఎట్టికష్టకాలములయందైన
నట్టిట్టుగాక దిట్టమైయుండు నాగుండె దిట్టతనంబు నేఁడు పట్టుచెడి
యెనా? త్రిలోకశాసనపటిష్ఠంబగు నాప్రతాపసారము నిస్సా
రమయ్యెనా? కాదు; కాదు. అంతయు నదృష్టమహిమంబని
తోఁచుచున్నది. లక్ష్మీ! నీవెంత చంచలురాలవు!

ఉ. అంచితరీతి దుఃఖ మిసుమంతయుఁ దోఁపఁగనీక నన్ను మో
హించి సతంబు మద్గృహ వసించి, భుజాగ్రములందు నిన్ను మో
యించి, జగంబులం దెచట నింతటి సంపదగల్గువాఁడు లేఁ
డంచుఁ దలంపఁ జేసి తగునా యిటు గోతనుద్రోయఁ జంచలా!

తలంచినకొలందియు పరితాపము మహత్తరమై కర్తవ్యజ్ఞానము నశించు
చున్నది. కట్టడివిధి యీమైరావణునిజాతకంబు నిట్లు తారుమా
రుగావించునని స్వప్నమందైనఁ దలంచి యెఱుంగనుగా! ఈ
మహావీరుఁడు పురుషునకోటువడియెనా? కాదు. అబలయై-అన
హాయయైన యొక్క-హంతకారి దుస్తంత్రమున నంతమునుగతికి
వచ్చెను! ఇంతకన్న పరాభవం బింకేమిగలదు! నాచేతులతోడ
పరిజనులనందఱ నాపాపినికి బలియొసంగి చేతులు గడుగుకొం
టిని! (ఆలోచించి) ఛీ! ఛీ! ఏమి యీనిర్వేదము! నాకిది
తగునా? దీననేమైనఁ బ్రయోజనంబగునా? ఈకపటవేషంబున-
నీకాళరాత్రియం దీపాపాత్మురాలిం బరిమార్పక నిదురింతునా?

సీ. భూరిసంపత్ప్రభాపూరితంబైయున్న
గుహ నమానుషముగఁ గొల్లవెట్టి
సాహసోద్ధతిఁ బూని శవఖండయుగము నైం
ద్రపుజాలముం బలెఁ దస్కరించి
గురుతులనెల్ల నగ్గోలు గావించి నా
చేత లేచుక్కనుఁ జెనకఁజేసి

తైలభాండంబుల దాగియుండినవారి
నతిసాహసంబున హతముజేసి
దూర్తయగుచు నన్నుఁ బలాయితునిగఁజేసి
నట్టిదుష్టు నాహంతకి మట్టుబెట్టి
బహుళరక్తప్రవాహము ల్పారఁజేసి
ప్రాణములు బాయువాఁడ వైరంబు దీరఁగ.

సీ. అసమధీర కుమారుఁ డసురుడైరావణు
మాత్సర్యమునఁ బరిమార్చినట్లు
కనకకశ్యపుని నేపున నారసింహుఁడు
చీల్చి వక్షంబు పెకల్చినట్లు
దుశ్శాసనుని ఱొమ్ము దోశ్శక్తిఁ బెకలించి
రక్తంబు భీముఁడు ద్రావినట్లు
కంసదానవుని భీకరమూర్తియై కృష్ణుఁ
డంచితంబుగ వధియించినట్లు

సాటిలేని శౌర్యంబున నేఁటిరేయి
ప్రకట నిహతనిర్భిన్నశిరస్కఁజేసి
రక్తమును గ్రోలి నాదు వైరంబు బాసి
హాయిగా ప్రాణనిచయంబుఁ బాయువాఁడ.

(అటునిటుఁ జూచి) ఎవ్వరో వచ్చుచున్నారు. ఇఁక నాపాత్రంబు నభిన
యింపవలయు.

(మరల మునివృత్తినుండును.)

[చతుర ప్రవేశము.]

చతు—(స్వగ) విజ్ఞానశాలులగువారు దొంగను ముఖవీక్షణమాత్ర
ముననే కనిపెట్టఁగల్గుదరు.

సీ. మదికి సమ్మతి లేనిమాటలు వినసట్లు
చరియింపఁ జూచెడుజనుఁడు దొంగ
వెకలినవ్వులు ముఖప్రీతులకొఱకునై
బలవంతముగ నవ్వువాఁడు దొంగ
నిజము వాక్యముల ఖండితముగాఁ జెప్పక
పలువిధంబులఁ జెప్పువాఁడు దొంగ
యెదుటిప్రశ్నలకుఁ దా నేదియో మఱుమాట
వచియింపఁ జూచెడువాఁడు దొంగ
అడుగ నుపకారమును సేతు ననుచు- తుదకుఁ
దొంటచేయి చూపెడుమహాత్ముండు దొంగ-
పరుల నెమ్మొగంబులు తేరి పారఁజూచి
కటునిటులఁ జూచి మాటాడునతఁడు దొంగ.

శాని- యీస్వామిరావణచోరుని మాయానటనంబు చతురులై రంగస్థలంబులఁ బేరుగాంచిన నటశిఖామణులకు సయిత మలవడదుగదా! (ప్రకాశముగా) మహాత్మా!

స్వైరా—(స్వగ) కటకటా! ఈగండయే కదా నాహృదయశల్యము! అట్లుండియు దీని నేమియుం జేయ లేక నిరర్థకుండనై యుండవలసివచ్చెఁగదా! (ప్రకాశముగా) అమ్మాయీ! ఏమి పనియుండి వచ్చితివి ?

చతు—మహాత్మా! నాకు వేఱుగా నేమిపనియున్నది? మీపనియందే యుంటిని.

స్వైరా—మే మింక నొకజాముకాలమువఱకుఁ దపోనిష్ఠయందు మున్గెదము. ఇప్పుడు మా కభ్యర్థనీయము లగునవేవియును లేవు.

చతు—భోజనపదార్థములందు తమ కేవి ప్రీతికరములో యని—

మైరా—ఏపదార్థంబులను సిద్ధపఱచిన సరియే—కాని వానియందు లవణముమాత్రము మా కిష్టము గాదు.

చతు—(స్వగ) నా యనుమానమే స్థిరమైనది! (పండ్లు కొఱుకుచు) ఓరీ మైరావణహతకా! నీకు మాయింట లవణ మిష్టము గాదుగా! క్రూరుఁడా! శత్రువు నింట నుప్పు దినరాదుగదా నీవిట్లు పలుకుట! కానిమ్ము. (ప్రకాశముగా) మహాప్రసాదము; కాని- స్వామీ! ఉప్పులేని పదార్థములు జీవములేని శరీరము వలె—ధనములేని మందిరమువలె—పరిజనులు లేనియధికారి వలె—నిస్సారములుగదా! ఇట్టికోరికఁ గోరితిరేమి?

మైరా—(స్వగ) ఏమిది! ఈమాటలన్నియు నాకే తగిలి వచ్చుచున్నవి! (ప్రకాశముగా) అమ్మాయీ! అది నాకొకయాచారము.

చతు—ఇట్టివి మానవులకు సహజముగ శత్రులయింట నాచారములై యుండును.

మైరా—(తనలో) దీనితోడ విశేషప్రసంగము చేయఁదగదు. అమ్మాయీ! నాకు జపసమయమైనది.

(నిష్క్రమించును.)

చతు—(క్రోధముతో) ఓరినష్టా! నికృష్టా! మర్మదాంధా! నాపాల బడితివిలే! నీ వింకెందుఁ బోయెదవు? నీ వీరాత్రి వాకటారి పాలఁబడక బ్రదికినప్పుడుగదా యనంతమగు నీయాశాప్రవాహ ముసాగుట! విషసర్పంబులకు మంత్రము లుండవని తలఁచితివా! శార్దూలంబులకు మదమాతంగంబు లుండవనుకొంటివా! ఈచతుర నీపాలిటి కాలమృత్యువని తలంపకుంటివా! మందబుద్ధీ! చావుఁగోరియే నీ వీమందిరమునం బ్రవేశించితివి; కానీ చూతము........(ఇంచుకాలోచించి) వీని నిప్పు డేవిధంబునఁ

బోకార్పనగు ?-నిపుణించుటకటి హాతమాత్తునా? ఔరా! వీఁడా నిద్రించుచుట! ఈయుంటునా ?......కల్ల కల్ల — సమయము వేఁచి మమ్ము చంపనెంచిన వీఁడు- నిర్మలముగ నిద్రించునా ?-ఇది తగనియుక్తి-వీనిని రక్షకభటుల కప్పగింతునా !-సాహసము లేపి పిఱికిపని — నాకొకటి తోఁచుచున్నది. అపని చేయుదునా ? ఇది యెట్లుండునో-ఈ రేయి-వీని యానందమునకై-నృత్యసభనొక టి గావించి, యందు సకలపరిమజ్జనుల సమక్షమున- సాహసమున చేత కటారిఁగొని తటాలున వీనిశిరంబు నెగుర వేసెద-పై విధానమునకుఁ బరమేశ్వరుఁ డున్నాఁడు.

సీ. కృతయుగంబున శాంకరీదేవి మహిష
రాక్షసు ద్రుంచె నేసాహసంబుచేత
జనకభూపతిపుత్రి శతకంఠదానవు
వధియించె నేబాహుబలముచేత
సత్యభామాదేవి దైత్యుఁడౌ నరకుని
ఖండించె నేపరాక్రమముచేత
ధరణి పృథ్వీరాజ తరుణి సంయుక్త యు
ద్ధం బొనర్చె నేదర్పంబుచేత
నట్టి సాహసస్థైర్యము లలవరించి
నేఁటిరేయి మైరావణు గీటడంచి
యంచితంబుగ హితము గావించి మమ్ము
రక్షణము సేయుమయ్య! శ్రీరామచంద్ర.

(నిష్క్రమింతురు.)



రంగము:—అదృష్టగుప్తుని మందిరము.

నృత్యసభ.

[అదృష్టగుప్తుడు, మైరావణుఁడు, అదృష్టగుప్తుని బంధువులు, అనేకులాసీనులై యుండగా, చతుర కటారిఁ గైకొని నృత్యము చేయుచున్నది.]

చతు— —పాట—

యమన్—త్రిశగతి.

దుర్మద శతారి। యీ। మిటారిచేతిది। కటారి।
నిర్మలమానసులకెందు। నియతినొసగు రామరక్ష
కర్మచండాలురకును। గతినతరంబయినశిక్ష॥ దు॥

(విచిత్రరీతుల నభినయించి చేతిలోని కటారిని భయంకరముగా పైకెత్తి చంపఁదలఁచినట్లు నృత్యము చేయుచున్నది.)

అందఱు—(ఆనందించుచున్నారు)

మైరా—(మొగమున భీతి కనఁబడుచున్నది.)

చతు— యమన్—త్రిశగతి.

లోకులధన మపహరించి - పీకల ధృతి నుత్తరించి।
ఆకార మలతిమార్చి - నట్టికట్టడుల వధింప॥ దు॥

(తటాలున మైరావణుని గొంతుపై కత్తినుంచి యభినయించును)

మైరా—(మహాభయమున తనకత్తి కొఱకు ప్రయత్నించుచున్నాఁడు)

చతు—(పై చరణమును బాడుచు క్రమముగ సభికు లందఱికంఠముల పై నట్లే కత్తినుంచి అభినయించుచున్నది.)

మైరా—(భీతివాని ఆనందించుచున్నాఁడు.)

అందఱు—(ఆనందించుచున్నారు.)

చతు—  యమన్—త్రిశ్రగతి.

చతురచేతి దీకటారి- చెనటుల జీల్చెడుకటారి-
చాతుర్య మగుకటారి। జనామోద మగు కటారి॥ చ॥

(కటారిని సభికుల తలలపై నాడించుచు నాట్యముచేయుచున్నది.)

అందఱు—(ఆనందించుచున్నారు)

చతు—(తీవ్రనాట్యము చేయుచు)

యమన్—త్రిశ్రగతి.

తొలకరిమెఱుపులను మించు। తళతళకాంతులనునించు।
నీకటారి యిపుడెర- క్తప్రవాహములను గాంచు॥

(సురావణుని గుండెలలోఁ బొడుచును.)

సురా—హా! హా! హా! (నేలపై కొఱగి కొట్టుకొనుచున్నాడు.)

(అందఱు విభ్రాంతినందుచున్నారు. కొందఱీలలు వేయఁగా రక్షకభటులు ప్రవేశించి, చతురను బట్టుకొనుచున్నారు)

అద్బు—(కోపముతో) ఛీ! ఛీ! రాకాసీ! ఏమిఁకని చేసితివి?—సుగుణ రాసివని, ప్రాణంబులను రక్షించిన పరమోపకారివని, నిన్ను మన్నించినందులకు నాయింటికి వచ్చిన పూజ్యాంశగు నతిథిని వధించి నాకెట్టియిక్కట్టుఁ గలిగించితివి? నీకేమైన నున్మాదము గలిగెనా?—ఏభూతమైన ని న్నావేశించెనా? పలుగాకీ!

చతు—అయ్యా! తొందఱపడవలదు. న న్నేభూతము నావేశింపలేదు. చిరకాలమునుండి మనగృహంబు నావేశించిన పెనుభూతము నేఁడు వదలిపోయినది. ఈకపటసన్యాసి యెవ్వఁడో కనులారఁ జూడుఁడు.

(గడ్డము లాగివేయఁగా నందఱు విస్మయమందుచున్నారు. పోలీసులు చతురను వదలి దూరముగ నిలతురు.)

అదృ—హా! ఏమిది? వీఁడు మైరావణుఁడనుచోరుఁడు గాఁడా?

చతు—వీఁడు మనప్రాణంబులం దీయవచ్చిన కీలెఱింగి యుపాయాంతరంబు గానక నిట్లొనర్చిన నాతప్పు మన్నింపవలయును. ఇదిగో వీనికత్తి.

(వానివస్త్రములనున్న దానిని తీసి చూపును.)

అదృ—ఔరా! ఎంతటక్కరివై యీదొంగ నాయిల్లు చేరెను! మరణాసన్నమైన వీనివదనంబుఁ గనుఁగొన్న నాగుండె లదరుచున్నవి.

చతు—గీ. దేశమం దెల్లయెడల పోలీసువారు
వెదకినను దొరుకని "వాఁడెవీఁడు" సుండు
నూనె గొనివచ్చి నినుఁ జంపఁ బూనినట్టి
"వాఁడెవీఁడు" సుఁడీ దుష్టవర్తనుండు
కపటసన్యాసివేషంబుఁ గాంచినట్టి
"వాఁడెవీఁ" డిట్లు నినుఁ జంపవచ్చినాఁడు.

ప్రియ—(ప్రవేశించి) చతురా! నాగురునాథుని జంపుటకు నీకు చేతులెట్లువచ్చెనే పాపాత్మురాలా!

అదృ—వధూనికా! వీఁడు, నీగురునాథుఁడు కాఁడు మనము యోగ్యుఁడనిభ్రమపడిన వీఁడు మనలనందఱఁ జంపవచ్చిన నీచుఁడు. వీనిం జంపుటచేత నీచ యని మనమనుకొనుచున్న యీచతుర మనయందఱిప్రాణములం గాపాడిన యోగ్యురాలు.

ప్రియ—ఏమిది?—వీఁడు చోరుఁడా!

మైరా—(ఆయాసపడుచు రోషమున) ఓసీ—రాకాసీ—నాపరివారము—నలుబదిమందిని బరిమార్చి—తుదకు నన్ను సయితము—నీపొట్టను బెట్టుకొంటివి గదా!—వినోద నృత్య మని భ్రాంతినందితిని గాని—మారణకృత్య మని యెఱుంగనైతిని

గదా—హా! హా!—ఈమైరావణుఁడు—తన ప్రతీకారముఁదీర్చు కొనలేక ప్రాణంబులు బాయునా—మీరందఱిదె చచ్చితిరి చూడుఁడు. (మైరావణుఁడు కత్తి నెత్తి చతురను పొడువఁబోవ, పోలీసులు వాని నణచిపట్టుకొన తిరిగి పడిపోవును.)

మైరా—ఛీ!—ఛీ!—నన్ను మోసగించి చంపితిరి గాని, బహిరంగ ముగఁ జంప మీతరమా! హా! హా! (ప్రాణములు విడుచును.)

చతు—"వజ్రం వజ్రేణ భిద్యతే" మోసమునకు మోసమే ప్రతీకార మని యెఱుంగవైటరా పాపీ!

పోలీసు సూపరింటెండెంటు—(తన జేబులోనుండి యొక పటమును దీసి) చతురా!—ఈమైరావణమహాచోరుని కొఱకు సర్కారు వారనేక దినములనుండియు వెదకుచుండిరి. ఈపటమును ప్రకట పఱచి వీనిని, వీనియనుచరులను నలుబదిమంది చోరులను బట్టుకొన్నవారికి పదివేల రూప్యములు బహుమాన మని సర్కారువారిదివఱకే వాగ్దానము చేసియుండిరి. ఈనీచరిత్రము నా కానందముఁ గలిగించినది ఆపదివేలరూప్యములు నీయవి. అదిగాక—నీశూరకార్యమునకు నీకు "శ్రీమతి" యని బిరుదు నిచ్చుచున్నాను. నేటినుండియు నీవు శ్రీమతి చతురాదేవి యని పిలువఁబడెదవు గాక!

(సువర్ణపతకము నిచ్చును)

(అందఱు కరతాళ ధ్వనులు చేయుదురు)

అదృ—(సూపరింటెండెంటుతో) అయ్యా! ఈచోరుని యనంతమగు ధనము నాచేఁ జిక్కియున్నది. దానిని నేను వ్రయపఱుపకుండ నుంచితిని. అందొక లక్షరూప్యములు కాంగ్రెసున కిచ్చుటకు నేను సంకల్పించుకొంటిని. తమ కనుగ్రహము గలదేని యట్లొ నరించి మిగతధనము సర్కారున కప్పగింపనున్నాను.

సూత—అట్లే చేయవచ్చును.

చతు—నాకు సర్కారువా రిచ్చిన పదివేలును స్వరాజ్యనిధి కొసంగితిని.

(అందఱు కరతాళములు చేయుదురు)

సూత—ఇంక మే మరిగెదము.

(నిష్క్రమింతురు)

అదృ—చతురా! నీయుపకారభరమును నేను తీర్చుకొనలేను.

గీ. జమునిఁ గనున్న నాప్రాణచయము నిలిపి
వంచకుల నెల్లరను వధియించినావు
వనితలను వీరకాంతవై ప్రోబలినావు
చతుర! నీయుపకారంబు మితిమీఱె

ఇందులకు నాప్రాణధనంబులు నీ కర్పించుటదప్ప వేఱేమియుం జేయలేను.

చతు—నేను స్వామిఋణముం దీర్చుకొంటిని. అధిక మేమియుం జేయలేదు.

ప్రేమ—చతురా! నిన్ను నేను పెట్టినబాధల కిప్పుడు మిగుల లజ్జించుచున్నాను. నన్ను క్షమింపుము.

చతు—అమ్మా! అటులాడఁదగునా; నాతల్లివి గావా నీవు? చిన్ననాటనుండియు నన్ను పెంచి యింతవానినిగాఁ జేసిన నీఋణమును నే నెన్నిజన్మములెత్తి తీర్చుకొనఁగలను?

ప్రేమ—నాయనా! అదృష్టగుప్తా! ఈబంధువులందఱియెదుట నీశుభకాలమున, నీవు మనసార వరించిన యీశ్రీమతి చతురాదేవిని వివాహమాడుము.

అదృ—వధూసకా! మాయింటికి పెద్దవైన నీవే! నాకు తల్లివైన నీవే-వదినవైననీవే! నీయిష్టమెట్లో యట్లే గావింపుము—నీమాట కెదురాడుదునే!

(చతురాదృష్టగుప్తులు పూలదండలను వేసికొని పాణిగ్రహణము చేయుదురు. అందఱు మంగళము పాడుదురు.)

(అనుబంధము 22)

మంగళము.

షష్ఠాంకము.

సర్వమును

సంపూర్ణము.



# అనుబంధములు.

## 1 ప్రమద బ్యాగ్—ఆది.

ప॥ ఇదిగూ నీవొనరించుచున్న దీ । యింటఁజేరి యొంటిపాటుగా
నిట॥ ఇది॥

అ॥ ప॥ సదభిప్రాయ విదూరుండ వగుచు । సంతతంబు నిట్లు గుల్ల
సేయుచు॥ ఇది॥

చ॥ (1) రాష్ట్రమువలదని—రావుబహాదారు పట్టమబ్బె ననుచుఁ గులుకు
చుంటివె?—కట్టడి వై—విస్కీలకు వైనులకిట్టె ధనముపాడు
చేయుచును నీ॥ ట్లిది॥

(2) దొరలంచును దొరసానులంచును నీ । వరమర లేక నహర్ని
శంబులను । దొరలుచుంటివా క్లబ్బులలోపల । దురితమనక
నీతాతచుట్టములె?॥ యిది॥

## 2 ప్రమద. కమాచి—ఆది.

ప॥ సైచెదనా । యిక గాచెదనా । సహి । యించెదనా । నా ।
మదినీ । విధమును । పీచమడంచెద । హీనిమ హూద్ధతి । నెం
చెద । గాంచెద । మనమున శాంతిని॥ సైచె॥

చ॥ అగునా । చతురపైన దనకిటులగునా । ముదియైన దనకు
మోహామా । కపటమా॥ సైచె॥

## 3 చతుర. కల్యాణి—రూపకము.

(ఏమీయాహ్వతమువలె)

ప॥ ఏలాజీవనము ? । మన దేశసేవ । జేయనోపని॥ దేలా॥

చ॥ (1) శ్రీలఁజెలఁగు భరతమాత । కూళలచే సిరులుమాయ ।
ఆలసింపక దేశారాధన । మాచరించి కీర్తిగాంచని॥ దేలా॥

(2) పావనచరకాని పాద । పారవశ్యమంది మాతృ ।
దేవికనుల ధారాపాతము । నీరతన్ హరింపజాలని॥ దేలా॥
(3) శిరమువంచి దాసులగుచు । పరులఁగొల్చు భారతీయుల ।
చరితముల దొలంగఁ జేయు । దగినమార్గము నాలోచింపని॥ దే॥
(4) మూఢతపరదేశవస్తు । మోహమున మునింగిపొంగి ।
గాఢదాస్యసాగరంబున । గంఠపూర్ణముగా మునింగిన॥ దేలా॥
(5) జయజయనాదములు సలిపి । జయతుజయతు భరతమాత ।
జయస్వరాజ్యమాతయనుచు । సంతసంబున సన్నుతింపని॥ దే॥

4 చతుర. నూల్ కౌస్—ఆది.

ప॥ పలుకఁగూడనే పాపపుమాటల । ప్రియమున ।
ననుగనుజనకుడ వేచ్ఛృథా॥ ప॥

చ॥ (1) పాపమునక మధు । పానము సలుపుచు । కోపతాపముల । కును
వెఱపొందక । నీపవిత్ర సామ్రాజ్యము నపయశ । కూపము
లంబడు ఘోరనురుక్తు లు॥ ప॥
(2) మనకులముల నిటు । సలుపుటవింటిరె । సనయంబగు కులా
చారము నెఱుగరె । జనములు ఘనపరిహాసము సలుపరె ।
ధనమునకిదియా ఫలితము మీరిటు॥ ప॥

5 అదృష్టగుప్తుఁడు.

నాథనామక్రియ తిశ్రగతి.

ప॥ ఇంతజేసితే పరాత్పరా । నీ దాసుని న॥ న్నింత॥

చ॥ (1) ఎంతోధనమిచ్చి । మరి । యెంతోవైభవమిచ్చి । యెంతయు
విద్యాప్రమోదితాంతరంగుఁజేసి । సుంతయైన కరుణలేని సోద
రుని ఘటింపఁజేసి । కాంతారాంతరనివాసు । గా నొనర్చి ।
కరుణమార్చి॥ యింత॥

(2) ఏమిసేయుదలంచినావో? ఏమాయఘటించినావో। నీమాయల నెఱుగదరమె। నిఖలలోకపాలా న॥ న్నింత॥

6. అదృష్టగుప్తుఁడు.

బీన్ ఫలాస్—ఆదితాళము.

ప॥ గోవింద దామోదరా। నారాయణ। గోకులవనసంచారీ॥ హారీ॥ గోవిం॥

అ॥ ప॥ పావనచరణ క్మ। పాజలధీ ముని।
సేవిత మోహానకార వినోదీ॥ గోవిం॥

చ॥ గృహామును భాసితి। సిహాముసురోసితి। బహుసురితంబుల నెఱుగక చేసితి। నీదయగోరితినయ్యా మురారీ॥ గోవిం॥

7. అదృష్టగుప్తుఁడు.

జయంతశ్రీ—ఆదితాళము.

(మరుగేలరా ఓ రాఘవా వలె)

ప॥ గోదావరీ। కరుణాకరీ॥ గోదా॥

అ॥ ప॥ నీదాసుని వ। న్నేలుకొమ్మతల్లీ। నిర్మలపవిత్ర వా। స్వాతకల్ప వల్లీ॥ గోదా॥

చ॥ నిన్ను జేరువారి। నిఖలాఘములు। సన్నుతాంగి వేగ సమ యింతువమ్మ। నిన్ను సన్నుతింప నేరనమ్మ దేవి। చిన్నచూపు మాని। చేరదీయుమమ్మ॥ గోదా॥

8. దొంగలు.

బ్యాస్—రూపకం.

(చనుడంద మూర వలె)

రండుమోదమూర। భుజాసాహసలార। మహాశూహలారా।

మహాధీరులార । భయంకరులారా । రిపుహరులారా । చెండు
డీ । ప్రచండులై । మహోద్దండులై । పుడమిజనము లదలి
మిగుల తల్లడిల్లగా । కాళీ । కృపావిలాస । మనసౌ మనకు ।
ధనదత్తుంబు । లమరుచుండగా । హుషార్- హుషార్-
హుషార్- హుషార్॥ రంగు॥

9. అదృష్టగుప్తుఁడు.

సురట—త్రిశ్రగతి.

ప॥ ఆశ్చర్యమయ్యెగా । ఈ గుహాతలముగాంచ మ॥ హాశ్చ॥

అ॥ ప॥ నిశ్చయానిశ్చయంబు । తెలియగక మదిసందడించె । నిది మహా
ధనాన్వితంబు । నిరుపమమాయామయంబు॥ ఆశ్చ॥

చ॥ సురకిన్నరఖేచరులకుఁ జూడ నద్భుతంబిదీ । నరులకలవిగాదు
కనుల । మెరయు నమానుషతలము॥ మ॥ హాశ్చ॥

10. ప్రమద.

బీన్ ఫలాస్—రూపకము.

(నాధా మీరలిటుల చింతిలుచుండగ వలె)

ప॥ నాధా । యిటులచనువు మరచి చరించుట తగునా॥ నా॥

అ॥ ప॥ దేహగేహములు సమసిన దిక్కెవ్వరు మనకూ॥ నా॥

చ॥ అసురారసంబునాని । యిటులధనార్జనము మాని । నీస
ములురిడుట గలదా । నింద్యమనుచు దలపవలద । దోసమార్గ
మును మానుము । తొంటివిధంబును బూనుము- అలఅలఅలఅల-
అలఅలఅల వినాశమే ఫలంబగున్॥ నాధా॥

## 11. మైరావణుఁడు.

బ్యాగ్ — త్రిశ్రగతి.

పనిగొని డొంకడొంకలన్ । చనుచను డింకగొంకకన్ ।
కనుగొని వాని యుంకువన్ । గొనియిట దెంచు తెండికన్॥ ప॥
ఘనగగనంబు దూఁరినట్ । వనధులదారి జేరినట్ ।
వనములలోన బారినట్ । ఘనగుహాలట్ వెలారినట్ ॥ ప॥

## 12. దొంగలు అందఱు

బ్యాగ్ — ఆదితాళము.

దొంకితివారా । దుర్మదచోరా । దుష్టుఁడవే యఘచారా ।
బిరబిర నిన్ని । ఖరాసితలముల । బరిమార్తుము । కసిదీరా॥ దొ॥
పరాక్రమించితివారా ।. బిరాననిన్ని ఘోరా । రణ్యాంబునందే
భీకరగతి ప్రాణంబులు దీసెదమారౌరా॥ దొ॥

## 13. ప్రమద.

సురట — ఆదితాళము.

ప॥ న్యాయాన్యాయములను విమర్శించుటకె నా । యిలుజేరితి
వా ఛీ । తులువా పలువా॥ న్యా॥
అ॥ ప॥ పాయవెన్నిగతులదూఁరిన । పనికిమాలినట్టి దుష్కృతంబుల॥ నా॥
చ॥ నామగంటు నీదుపాడురూపము । నకే భ్రమసి చెడుదారుల
పాలయి । నీమమెల్లమంటబెట్టి నేటికి నిలువనీడలేక తిరుగుచుం
డుట॥ న్యా॥

## 14 అదృష్టగుప్తుఁడు.

సింహేంద్రమధ్య — త్రిశ్రగతి (చింతిలకమ్మా వలె)

ప॥ ఇటులనలుపుటా । మనకిపుడు శ్రేయమగున తగున॥ యి॥

అ॥ ప॥ కటకట యిటునలుపుమన్న । కార్యహానిగాదటమ్మ॥ యి॥
చ॥ చతురతోడ నీయుపాయ । సమయమందు పగనుగొన్న ।
వితగ మనరహస్యములను । వెల్లడించు । విధిదలంచు॥ ని॥

15. మైరావణుఁడు & పరివారము.

ట్యాన్—రూపకం.

మైరా—
భీతిని బొందకుడింక ని । శాతకృపాణంబుల నరి ।
వ్రాతంబు వధింపుడు హితు । లారా॥ భీ॥
పాతకుల నెల్ల । బాధించి వేధించి॥ పాలార్పరే । పగ॥ దీరా॥ భీ॥

పరి—నీపద । సేవల । నేపార । జేసెదు । నీపరివారముగామా ।
మా పరాక్రమంబు । లేపార నాపాపి । రూపడంతుమో స్వా
మీ । కాళీ యనుగ్రహంబున జోహార్- జోహార్- జోహార్॥

మై. రా—భీతి॥

16 మైరావణుఁడు & పరివారము.

(విమల కమల లోగు బాగు వలె)

మైరా—వెనుకబొందు
రిపుని చోరులారా-

పరి—ఆ- ఆ- ఆ- ఆ-

మైరా—సత్వరముగ॥ వె॥

పరి.—తరులు గిరులు కరులుఁదరా బిరబిర నరిగెదము దొరా

మైరా—చతురనిధా । నములపధా । వళులయధా । గతినరయుఁడు॥

## 17. మైరావణుఁడు.

భైరవి—ఆదితాళము.

హాతమూర్ఛదన్ । ధృతిదూల్చెదన్ । క్షితిగూల్చెదన్ । రిపు
జాలముల । భూరిపరాక్రమ । విక్రమ । ధైర్యభు । జాసారము
సరి । నే । హా । రన ॥ హా ॥

భూతలమెల్లన్ । భీతిని జెందన్ । పాతకులందర । బోకార్తున్ ॥
ఏతరిసెంచిన । ఖ్యాతినిగాంచెద । శాతకరాయుధ । ధీ । శ । క్తిన్ ॥

## 18. జాంబూకుఁడు & చతుర.

(ఆహా-ఆహా రే-వలె)

జాంబూ—హాయి హాయిరే । రేమితాయీ । దీపకెమ్మోహీ అందమైన
నారీ । సొగసైనఛటకారీ । వారెవారె రేకొటారి । కులాధారి ।
సుకుమారి । చిలుకలకొలికీ । అహాహో । మదనునిముల్కీ ॥ హాయి ॥

చతుర—చాలుచాలు తాతా । నీ । సరస । ముసలిసరసమూ ।
కాదునది పరుషమూ । పదపడి విరసమూ । వేగమే ధనమును
గొనుమా ।

జంబూ—హాయి ॥

## 19. జంబూకుఁడు.

జంఝూటి—అటతాళం.

ప॥ నారీమిటారీ । వయ్యారీ । హితకారీ । దారిజూపవె సుందరీ
అహాహోసుందరీ । అహాహోసుందరీ ॥ నారీ ॥

చ॥ (1) కనులగంతలుగట్టి । కరిచేతనుబెట్టి । నాతోడ నీతుంబు
బూంతులు నాడకె ॥ నారీ ॥

(2) సంభోగోపాయలతో। చమడాలుగుట్టించి। గుట్టుదాచగ నన్ను।
గొంకులు దిప్పి॥ నారి॥

20 మైరావణుఁడు & పరివారము.

(ఎంతమోసగించెను యీనృపుఁడు వలె)

మైరా—కట। కటాచోరులా। రా మనయదృష్ట। మిటుల తారు
మారు। రగుచుండెను॥ కట॥ పటుభయంకర గుహాతలమీవిధి।
శ్మశానవిభమై తోఁచుచుండె॥ క॥

పరి—ఏలాయీగతి। జాలిదూలనో। స్వామీ। బేలతనంబిది తగు
నా। లీలనీజగజ్జాలమెల్ల గ। గ్గోలు పఱచు పరివారముండ॥

మైరా—కటకటా॥ (సాకీ) మనగుహాతలము పరులకు నలవిగానిదీ।
సురాసురులకైన నజేయమైనదీ॥

పరి—ఏలా॥

21 చతుర. బ్యాగ్—అటతాళం.

ముదముచేకూర। వదరకచోర। సంతతులఁ గూల్చెద సంతస
మేపార॥ ము॥

మోసగించి మమ్ము। గాసిలజేసిన। దోషకర్ములనెల్ల దుని
మెదనింక॥ ము॥

22 మంగళం.

మందరధర। మంగళకర। మంగళంబురా। మారసుందరా। శ్రీక
మేశబోధివరా॥ దానభరణ దోషహరణ దానవేశనాశా।
రాజరాజేశ్వరా। యోపరాత్పరా। శ్రీనివాస జగదీశ్వరా।
శ్రీరమానాయకా। జగన్నాయకా॥

సంపూర్ణము.



# రసపుత్రవిజయము.

(గ్రంథకర్త — శ్రీ ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారు.)

ఏ రసపుత్రవీరజ్యోతి హైందవ సామ్రాజ్యలక్ష్మీధురంధరుఁడగు పాలంఘీరుబాదుషా మరుగ్రితలూగించెనో, ఏ ప్రచండవీరావతారము రాజకీయరంగమున నవనవాదర్శములం బ్రదర్శించెనో, ఏ వీరసింహనామము శాత్రవగజములకు సింహస్వప్నమై గూ మేవాడ పార్థివుఁడగు రాజసింహుని దివ్యచరిత్ర. ఠాకూర్ దుర్గాదా సీనాటకమున సన్యాసివేషమున స్వాతంత్ర్యసంపాదనము సలిపెను. వీరమాత మహావీరమాత్రయై విలసిల్లినది ; విమలమానసయగు విమల — ఏ నారీలలామము జన్మమున, రూపనగరాధీశ్వరుని గర్భవారాశితోపాటు భారతేందిరాలలామము ధన్యురాలయ్యెనో — యా కళ్యాణగుణకళి, శ్రీరాజసింహవీరులపాణిగ్రహణాధీనమనస్కయై కావించిన యమానుషకృత్యములు — వీరవిహారములు — పడినకష్టములు చదివితీరవలయును ; విమలసోదరియగు ధర్మచ్యుత కేసరీబీగం, ఆలంఘీరు బాద్షాను పెండ్లియాడి విమలతోఁ బ్రతినబూని యామెను తురకకిచ్చి పెండ్లిచేయ యత్నించి తుదకు తానే రసపుత్రుల చేతులలోఁ బడుట, ఔరంగజేబు సేన లాహారపానీయములు లేక గుహాలోచిక్కువడుట, దుర్గాదాసు ప్రచ్ఛన్నవేషమున. రూపనగర భైరవాలయమున చెప్పిన జ్యోతిషమున శృంగారరసోదయమగుచున్నది. విమల విసరినపూలగుత్తి మన్మథుని ఫిరంగిగుండై రాజసింహు వక్షమునం దగులుట, చదువరుల నానందసాంబుధిని నోలలాడించును. గులాముని చంద్రభాగల హాస్యము, తురక పెండ్లికొడుకు హాస్యరసము, గులాము చమత్కారము బాలుండగు అజితసింహుని శూరత్వము. అద్భుతసమన్వితములు. వింతలోనివింత-విమలను గాపాడుటకై మగవేషముతో వచ్చిన, వీరమాతను గాంచి విమల రాజసింహునిగా నెంచి శృంగారసంభాషణము చేయుట, ఆసమయమునకే వచ్చిన రాజసింహుఁడు వీరమాతను పరపురుషునిగ భ్రమించి యాగ్రహపడుట మిగుల చమత్కారరంగము. ఆలంఘీరు కాశీవిశ్వేశ్వరాలయధ్వంసము చేయుట, హిందువులమానసములం గలఁచి గగుర్పాటు గలిగించుట - వేగో - దేశభక్తిపూరితము. పద్యములొక్కొక్కటి లక్షరూపాయల విలువగలది. ఆంధ్రదేశ రంగస్థలములందంతను వీరతాండవము సల్పిన మహాచరిత్రవీరనాటకము. ఔరంగజేబు పరిపాలనమంతయు నిందున్నది. చదివిచూడుడు. నవరసములు వర్షించు నాటకము. ఇప్పుడిట్టి నాటకరాజమే తెలుగున రచింపఁబడుటలేదు.

వెల 1—0—0.

వలయువారు — కురుకూరి సుబ్బారావు,
బుక్సెల్లర్, భీమడోలు,
కృష్ణాజిల్లా అనివ్రాయవలెను.

# ఆంధ్ర నాటకములు

| | రు. | అ. |
|---|---|---|
| ఊర్వశీశాపవిమోచనము అ॥ సు॥ | 1 | 0 |
| జయచంద్రచంద్రరేఖావిజయము | 0 | 10 |
| గులేబకావళి | 1 | 0 |
| శైబకావళి | 1 | 0 |
| కృష్ణవిలాసము | 0 | 12 |
| భంగము | 0 | 10 |
| శ్రీరామాంజనేయము పి॥ చి॥ | 1 | 0 |
| సంపూర్ణ భాగవతము శే॥ రా॥ | 0 | 12 |
| శ్రీకృష్ణ దేవరాయవిజయము | 0 | 12 |
| గోలాఫ్ విజయనగర్ | 0 | 12 |
| జయభాస్కరము జ॥ లు॥ | 1 | 0 |
| ప్రభాకర డిటో | 0 | 8 |
| శారదావిజయం కో॥ స॥ | 0 | 12 |
| ద్రికాంత డిటో | 0 | 12 |
| వాసంత డిటో | 0 | 12 |
| దాసీయము శే॥ రా॥ | 0 | 12 |
| మాలతీ మధుకరము బ॥ స్వా॥ | 1 | 0 |
| ప్రసాహసము వెం॥ వెం॥ | 0 | 10 |
| హరిశ్చంద్ర కా॥ పీ॥ | 0 | 12 |
| సతీసావిత్రి చ॥ మా॥ | 1 | 0 |
| హరిశ్చంద్ర డిటో | 1 | 0 |
| సంగీత ప్రహ్లాద డిటో | 0 | 12 |
| సంగీత స్త్రీసాహసము | 0 | 12 |
| స్వప్నపూర్వాహము | 1 | 0 |
| కృష్ణరాయబారము | 0 | 12 |
| చిత్రనళీయము | 1 | 4 |
| విమల నా॥ స॥ | 1 | 0 |
| రాధాకృష్ణ డిటో | 1 | 0 |
| విక్రియము డిటో | 1 | 0 |
| తరుకారాము త్యా॥ వెం॥ | 1 | 0 |

| | రు. | అ. |
|---|---|---|
| కుశలవ నాటకం వి॥ సు॥ | 0 | 12 |
| సారంగధర డిటో | 0 | 12 |
| సంపూర్ణోత్తర రామాయణము రా॥ నా॥ | 1 | 4 |
| సుమతీదేవి బ॥ కో॥ | 0 | 12 |
| హనుమద్రామసంగ్రామము | 0 | 12 |
| లక్ష్మణ మూర్ఛ సో॥ రా॥ | 0 | 12 |
| శకుంతల సో॥ రా॥ | 0 | 12 |
| దాన వీరకర్ణ డిటో | 1 | 0 |
| సంగీత గులేబకావళి చ॥ మా॥ | 1 | 0 |
| పాండవాజ్ఞాతవాసము ద్రో॥ పీ॥ | 0 | 8 |
| చతురచంద్రహాస డిటో | 0 | 8 |
| పీష్వా నారాయణరావు | 0 | 10 |
| రాయచూర్ ముట్టడి | 0 | 10 |
| శ్రీరామజననము | 0 | 8 |
| శ్రీరామ ప్రవాసము | 0 | 8 |
| శ్రీరామోద్యోగము | 0 | 8 |
| శ్రీరామ విజయము | 0 | 8 |
| శ్రీరామాశ్వమేధము | 0 | 8 |
| వైదర్భీవిలాసము | 0 | 12 |
| ఆంధ్ర పతాకము | 0 | 12 |
| సంస్కారిణి దా॥ వు॥ | 1 | 0 |
| రుక్మిణీ పరిణయం గం॥ శే॥ | 1 | 0 |
| సీతాకళ్యాణము బ॥ వీ॥ | 0 | 8 |
| సంగీత విష్ణులీల చ॥ మా॥ | 1 | 0 |
| చిత్రనళీయము నా॥ స॥ | 1 | 4 |
| తపతీ సంవరణము శా॥ కో॥ | 0 | 12 |
| సువర్ణపాత్రి రా॥ నా॥ | 1 | 0 |
| సుగ్రీవ పట్టాభిషేకం సో॥ రా॥ | 0 | 12 |
| సీతాకళ్యాణము డిటో | 0 | 12 |
| శ్రీరామ జననము డిటో | 0 | 12 |


వలయువారు:— కురుమూరి సుబ్బారావు,

బుక్ సెల్లరు అండ్ పబ్లిషర్, భీమడోలు, పశ్చిమ గోదావరిజిల్లా.

# రామదాసు

[గ్రంథకర్తలు:—రామనారాయణకవులు]

భద్రాచలరామదాసు నెఱుంగనివారాంధ్రులలో నెవ్వరుందురు? ఆంధ్రులందఱును వ్యయప్రయాసములకోర్చి ప్రతిసంవత్సరము నరుగుచున్న భద్రారణ్యమధ్యక్షేత్రమే! శ్రీరామదాసుండగు కంచెర్ల గోపన్న, యీపురమున రామాలయమును నిర్మించి యందులకై తానీషాధనమును వ్యయపఱచిన కారణమున పండ్రెండేండ్లు కారాగారమున నున్న భక్తిరసపూరితదివ్యచరిత్రము! శ్రీరామదాసు గోలకొండలోని చెఱసాలలోఁబడి శ్రీరామనామమే జీవనముగ భక్తిపరవశుఁడై పాడినపాటలను మన మనేకమారులు వినియుందుము. భిక్షుకుల దీనారావములయందును, దాసరుల తంబురలందును, భక్తుల పాగవశ్యములయందును భాగవతుల పదఘట్టనములందును మూర్తీభవించిన వీ రామదాసుగారి పాటలే! నిర్జనములగు నరణ్యముల మధ్యమునుండి, మహోన్నతమగు నంతరాళమునుండి అగాధమగు సాగరాంతరమునుండి, దివ్యకంఠములనుండి శ్రోత్రపేయము చేయునవి యీ రామసంకీర్తనములే!

ఈరామదాసుగారు కారాగారప్రాకారములనడుమ, భక్తితన్మయుఁడై పద్మాసనము వేసికొని, యీమాయాప్రపంచమున శ్రీరామునితో సాయుజ్యసాక్షిమ్మని తగవులాడినాఁడు. ఒక్కొక్కప్పుడు రామా అపచారము సల్పితినని, యాతనిపాదములపైఁ బడి చిన్నపిల్లవానివలె నేడ్చినాఁడు. మరొకప్పుడు రామునిఁజూచి వెర్రివానివలె నూరక నవ్వదొడఁగినాఁడు. ఆహా రామభక్తిప్రబోధము! ఈభాగములన్నియు నీనాటకరాజమున కవిబ్రహ్మచేఁ జిత్రింపఁబడినవి!

తానీషా రామదాసుల పూర్వజన్మచరిత్రలు-కబీరు నాదేశమున, రామదాసు శ్రీరాముని జూడఁగోర, రాముఁడు మహిమాకారమునరాగా రామదాసు భగవంతుఁడని యెఱుంగక కొట్టుట, శ్రీరాముని తాడనముచేసి యందులకై రామదాసు కారాగృహమునం దెబ్బలుతినుట, ఆలయనిర్మాణము, రామదాసు పుత్రుని మరణించి రామానుగ్రహమున జీవించుట, తానీషా ఆగ్రహము, రామదాసు తానీషాల సంవాదము. రామలక్ష్మణులర్ధరాత్రి రాజభటవేషములతో తానీషాయంతఃపురముఁ బ్రవేశించి సంవాదము చేయుట, తానీషాకు సొమ్ముచెల్లించి యాసక్తి ప్రాణహత్యాప్రయత్నమునున్న రామదాసునకు కారాగృహమున నిచ్చియదృశ్యులగుట, తానీషా క్షమార్పణము, రామదాసు భద్రాచలమున శ్రీరామ కైంకర్యము చేయుట-భక్తిరసభరితములగు పాటలతోనున్నది చదువవలసిన నాటకము. వెల 1—0—0

వలయువారు—కురుకూరి సుబ్బారావు,

బుక్కుసెల్లర్, భీమడోలు

